## ★ తారాపదము ★

### —* పురుషులు *—

| | | |
|---|---|---|
| సత్యవంతుడు | — | కథానాయకుడు |
| ద్యుమత్సేనుడు | — | సత్యవంతుని తండ్రి |
| సుమాలి | — | సత్యవంతుని మిత్రుడు |
| వినయచంద్రుడు | — | ద్యుమత్సేనుని మంత్రి |
| చిత్రకేతుడు | — | ద్యుమత్సేనుని శత్రురాజ |
| మేధావి | — | చిత్రకేతుని మంత్రి |
| నారదుడు | — | దేవముని |
| అశ్వపతి | — | కథానాయిక తండ్రి |
| యముడు | — | ప్రేతపతి |

రాయబారి, ఒక వైశ్యుడు, యమభటులు, పాపులు, బ్రాహ్మణులు మొదలగువారు సమయానుకూలముగ వత్తురు.

### —* స్త్రీలు *—

| | | |
|---|---|---|
| సావిత్రి | — | కథానాయిక |
| సరస్వతి | — | సావిత్రి చెలికత్తె |
| భవాని | — | సత్యవంతుని తల్లి |
| మాళవి | — | సావిత్రి తల్లి |



# సంగీత సావిత్రి

## ప్రథమాంకము

### 1 వ రంగము

ప్రదేశము — యుద్ధభూమియందొక శిబిరము

[ విశ్రాంతివేషములతోడ చిత్రకేతుడు, మేధావి — ప్రవేశము ]

చిత్ర : మంత్రీ! మేధావీ! ఇఁక మనకు విశేషశ్రమం బక్కఱలేకయే — ఈ ద్యుమత్సేనుని పురద్వారకవాటము పటాలున బ్రద్దలుగాఁగలదు. ఏమంటివా ?—

సీ. అంబరచుంబితా సంతోన్నతంబా ప
   తాకరాజంబు భూసలికిఁ గూలె
నినుమైన సరిరాని ఘనమైన ప్రాకార
   విధమంతయును బలు శిథిలమయ్యె
ఘనతరాభీల రక్తప్రవాహంబులు
   ప్రవహించి మోకాటి బంటియయ్యె
భీభత్సశత్రు గంభీర నిర్ఘోష ప్ర
   చారంబు క్రమముగా సన్నబడియె

నరినరాధీశ్వరులకు ధైర్యంబు జాఱె
జయరమామణి వలచి నా సరసఁ జేరె
శాత్రవ విదారుణము జైత్రయాత్ర తీఱె
భూతలి విపక్షసతుల సమ్మోదమాఱె.

మేధా: చిత్రకేతు మహారాజా! శాత్రవారణ్య దావానలంబై — నిజ యోధ సంతాన సంగ్రామతల మార్గప్రదర్శక హేతుభూతం బైన యుష్మత్ప్రతాపతేజం బట్టిదియే కాని, ద్యుమత్సేన మహారాజు సంధికి సంసిద్ధుడై యుండ, మన మాతని నంగరు ణించి యేల సామంతునిగఁ జేసికొనఁదగదు ?

చిత్ర : వెఱ్ఱివాఁడా! అది యట్టిది గాదు వినుము—

గీ. బాల్యమునఁ వీఁడు నాతండ్రిఁ బరిభవించి
బాంధవులు సూడ నెంతయుఁ బరిహసించె
ఘోరమా దత్కృతికిఁ గనుఁగ్రుడ్లు చితుకఁ
బొడువ నపుడు ప్రతిజ్ఞను బూనినాఁడ.

ఆ దురాత్ముని ముఖాముఖి నెదుర్కొని, పూర్వవిషయంబులం బురస్కరించి, యవమానించి గ్రుడ్లు పీకించి భీషణ ప్రతి హింసోత్సవ ప్రమోదంబు నంద నున్నవాఁడ. మత్సంకల్పాను కూలంబుననే ద్యుమత్సేన కుమారుం డగు చిత్రాశ్వుండును పురంబున లేఁడయ్యె.

మేధా: దేవా! ఎవ్వరో యిటు వచ్చుచున్నవారు. ద్యుమత్సేనుని రాయబారినిగా వానిం దలంతు. చేతియందున్న పతాక మటులే యున్నది.

చిత్ర : ఏమి యీ ద్యుమత్సేనుని బుద్ధిహీనత! కలిపోసిన నుట్టివంకకే చూచిన ట్లీమందుఁ డింకను రాయబారంబులే సలుపు చుండెనుగా! — రానిమ్ము. వాఁడు నాచేతి చపేటంబుల రుచి చవిజూచి తమరాజున కెఱిఁగింపఁగలఁడు.

[ పతాకము చేతబుచ్చుకొని రాయబారి — ప్రవేశము ]

రాయ: పరాకు చిత్రసేన రాజకంఠీరవా! పరాకు!!

చిత్ర : ఓరీ! ఎవ్వఁడవు నీవు ?

రాయ: మహారాజ మార్తాండశిరోమణి! నేను ద్యుమత్సేన మహీపాలుని దూతను, యుష్మచ్చరణ కమలంబులదరికి కార్యార్థినై వచ్చితిని.

చిత్ర : ఓహో !— సేనలన్నియును జచ్చి వీడు వల్లకాడైనను మావృద్ధ రాజు స్వప్రాణ రక్షణ సముద్యోగంబున, నిన్ను రాయబారిగా నంపెను కాబోలు నేమి !—కానిమ్ము. నీ పాఠ మప్పగింపుము వింటిమి.

రాయ: —

శా. దేవా ! దేవర జైత్రయాత్ర భువనాతీతంబుగా నొప్ప మీ
రీవేళన్ పుర మాక్రమించి మము సంప్రీతిం బ్రపాలింపనో
భావింపక బనియేమి భీమసమర వ్యాపార మింకేన్ సుహృ
ద్భావంబొప్పగ మా నృపాలుడు భవద్దాక్షిణ్యముం గోరెడున్.

శా. కాలం బంతయుఁ జెల్లె మా పతికి మీ కార్పణ్య మా వృద్ధ భూ
పాలుం జంపఁగఁ దీరునే ? విజయ మాపాదించె, కారుణ్య మీ
వేళ న్మాపయిఁ జూపి, బాంధవమునన్ వీక్షింపవే మమ్ము భూ
పాలా ! దాసులమైనవారము రణప్రారంభము న్మానవే.

ఆ. వె. సంధిసేయ మీకు సమ్మతమేని మా
ధారుణీశ్వరుండు తరలివచ్చి
ప్రేమఁ దనదు సింహపీఠికఁ జేర్చి సా
మంతుఁడై చెలంగు మానవేంద్ర !

చిత్ర : ఏమిరా నీ దుర్మతము ! మిన్నక వినుచున్నకొలంది యద్ధేచ్ఛ వ్యాపారంబున బట్టురాజువలెఁ జదువఁదొడంగితివి !—మీ రాజు ప్రేమతో మమ్ము సింహపీఠికం జేర్చునా ! నా తండ్రి నీ పాపాత్ముఁడు పరిభవించినప్పు డెట్టి ప్రేమను దానుఁ జూపెనో

యిప్పుడు నేను సయిత మట్టివాత్సల్యమునే చూపఁదలంచితినని విస్పష్టముగ నాతనికిఁ జెప్పుము. లేనిపోని పాటలు పాడితివా నీ ప్రాణంబులు దక్కవు పొమ్ము.

రాయ: మహాప్రభూ ! దీనతగ బ్రార్థించు మా మనవులను బాలించి—

చిత్ర : (చెంపపైఁగొట్టి) ఛీ ! అతిక్రాంతవాచాలా ! ఏమి నీ యధిక ప్రసంగము ! దూతవైనందుల కింతమాత్రపు బహూకృతితో సరిపోయినది. నీ రాజనీతులు నాకడ వలదన్నను—మేరమీఱి యుప్పగింప వచ్చితివఁటరా ! పలువా ! పొమ్మావలకు—మాఱాడితివా చచ్చెదవు. నా తండ్రి నవమానించిన పాపంబునకు నేఁడు నేను మీ రాజు గ్రుడ్లు దీయింపకపోవనని చెప్పుము. వేగముగ లేచిపొమ్ము. నాకు మఱింత యాగ్రహముం గలిగించితివేని చచ్చుటయే నిజము.

రాయ: శెలవు.

[ నిష్క్రమించును ]

చిత్ర : మంత్రీ ! మేధావీ ! చూచితివా వృద్ధ ద్యుమత్సేనుని కౌటిల్యము !—నన్ను మోసగించి సామవాక్యములాడి శాంతునిఁ జేసి ప్రాణములను దక్కించుకొనఁ దలఁచుచున్నాఁడు—ఇట్టి కపటాగ్రేసరుని మాయలకు నే నా లోఁబడునది. నీ కిది యానతి—

గీ. సేన లన్నియు రేపు విజృంభణమునఁ
గోట మాఱ్కొని భువిఁ బడఁ గొట్టవలయు
కుటిలుఁ డా భూమిపతి కనుగ్రుడ్లుజూచి
యింపుగా నాదుమది సంతసింప వలయు.

మేధా: భాగ్యము.

[ ఇరువురు నిష్క్రమింతురు ]

అవనిక జారును

# ౨ వ రంగము

ప్రదేశము — కోటబురుజు

[ వినయచంద్రుడు — ప్రవేశము ]

: కటకటా ! ఎంత ప్రమాదము సంభవించినది ? సమయంబునకు మా యువరాజు సయితము పురంబున లేక మాతులగృహంబున కరిగియుండెను. శతవృద్ధుఁడైన మా రాజేంద్రున కేది దారి ?— రాయబారంబా విఫలం బయ్యె—చిత్రకేతుఁడా దుర్జనుఁడు. ఏమేమి ఘోరంబుల నాచరించి వాఁ డీపురి వదలి చన నున్న వాఁడో తెలియరాదయ్యెను —

సీ. నిజముగా ముదుసలి నేల క్షోణినిబట్టి
దీనతఁ గన్నుగ్రుడ్లు తీయునేమొ
అంతఃపురాంగనా సంతానమును డాసి
మానభంగము సేయఁ బూనునేమొ
బాలుర వృద్ధులఁ బరిమార్చి, దండగాఁ
గోటకు శిరములు గ్రుచ్చునేమొ
నభ్రమండల సమున్నత సౌధముల నేల
మట్టంబుగాఁ బడఁగొట్టునేమొ
కరుణ యించుకయును లేక కటికి చెనఁటి
వీర రాక్షసకర్మ గావించునేమొ
కటకటా ! మాలదైవంబు కఠినుఁడాయె
మాకు శుభకాల మెప్పుడో మాసిపోయె.

ఆహా ! భగవంతునకుఁ గరుణకలిగిన—ధర్మాధర్మ పరిశీలన వివేకంబు గల్గిన—నిట్టి వ్యత్యస్తంబు లేల కలుగును ?—

సీ. పుణ్యస్వరూపులు బుక్కా పకీరులై
తిరిపెంబు నెత్తుచుఁ దిరుగుచుండ
పిల్లికైనను నొక్క పిడుచవేయని లోభి
స్వర్ణగోలికల నైశ్వర్యమంద
పరమపావన తపఃపరతంత్రులౌ మును
రసురుల నోళ్ళలో నణఁగిపోవ
కష్టాత్ములై పొందు దుష్టనిశాచరు
లమరసామ్రాజ్యంబు లనుభవింప
యైనవారికెల్ల నాకులయందున
కానివారికెల్లఁ గంచములను
బెట్టి లోక మేలు కట్టడిదైవమా
మంచి చెడ్డ లేవి? మహిని నీకు.

[ తెరలో ఫిరంగుల ప్రేలును ]

ఆహాహా! దారుణంబగు ప్రవిదారణం బారంభమైనది. గత్యంతర మేమియును గానరాదు. వగచిన ప్రయోజనంబేమి? సాధ్యమగునంతదనుకఁ బ్రయత్నించి మానుటయే ప్రాజ్ఞుల లక్షణము. వృద్ధుఁడగు ద్యుమత్సేన మహారాజును, మానవతి యగు భవానీదేవియు నెంత గుండె బగులుచున్నారో! వారల నూఱడించుటకైన నేను సమీపమున నుండవలయును గదా!

[ నిష్క్రమించును ]

—: o :—

## 3 వ రంగము

ప్రదేశము — రాజమందిరము

[ ద్యుమత్సేనుడు, భవానీ, వినయచంద్రుడు — ప్రవేశము ]

ద్యుమ: మంత్రీ ! వినయచంద్ర ! ఈ సమయంబున చిరంజీవికి వర్తమానమైనఁ బంపుటకు వీలు కలుగదయ్యె. పరమేశ్వరుఁడు పరాజితుల మైనను మమ్ము ప్రాణములతో విడువఁదలఁచుకొన్నట్లు లేదు. నా కేది కర్తవ్యము ?

విన : మహారాజా ! దైవ ప్రాతికూల్యమైన యీ సమయమున మన కేమి కర్తవ్య మున్నది ?—

గీ. అఖిల సేనాసమూహంబు నంతమయ్యె
రక్షణం బైన కోటయూ బ్రద్దలయ్యె
నరులఁ బరిమార్పఁగఁ గుమారుఁ డైన లేఁడు
రాష్ట్రమును బాసి చను టె కర్తవ్య మిపుడు.

ద్యుమ: అటులైన కందమూలంబులఁ దినుచు, నరణ్యంబులనైనఁ గాఁపుర ముండి మునివృత్తిఁదాల్చి హరినామమంత్ర పారాయణంబునఁ గాలముఁ బుత్తును. అట్లుసయితము నేను బ్రతుకునట్లు లేక—దురాత్ముఁ డగు చిత్రకేతుం డు పూర్వవైరముం బురస్కరించుకొని నా గ్రుడ్లు దీయుదు నని యుపాలంభ వాక్యములం బలుకుచున్న వాఁడఁట !—నే నేమి చేయుదును ?

విన : దేవా ! అనుటయేకాని, అన్నంతపని చేయునా ? అంతఘోరం బాచరింప వానిది మానవహృదయము కాదా ? దానువా ! పాషాణమా !

ద్యుమ: నీ వట్లనఁదగదు. వాఁ డట్టి క్రూరుఁడే.

భవా : హా! ప్రాణేశ్వరా!—మహైశ్వర్యంబుల ననుభవించుచు నిటుకాలటు పెట్టక, మిగుల సుకుమారులై యున్న మీకా ఈ ఘోరశిక్ష? నా కన్నులీ దారుణకర్మంబును దర్శించి యెట్లు సహింపఁగలవు—మీరు చల్లగ బ్రదికియుండఁగనే నే నగ్నిహోత్రమునం గూలి సాధ్వీలకు విధియైన మార్గంబునఁ బోయెదను.

విన : అమ్మా! అందులకైన నిప్పు డవకాశ మెక్కడిది?—

[ తె ర లో ]

మ. మును నాతండ్రిఁ బరాభవించిన ఖలాత్ముం డా ద్యుమత్సేనుఁ డెం
దనప్రాయస్థితి దాగియుండె నెఱుఁగంగాఁ జెప్పుడో సైనికుల్
తునియల్గాఁ జనఁ గన్నులం దఱిగి తద్గోళంబులం దీసి మ
జ్జనకోత్కృష్టఋణంబు దీర్చెద ఘనుల్ శ్లాఘింప భీమంబుగన్.

విన : మహారాజా! ఆ కుటిలుఁ డంతఃపురముం బ్రవేశించి తమ్మన్వేషించుచు నిందు వచ్చుచున్నవాఁడు.

భవా : హా! పరమేశ్వరా! దిక్కులేని మా కిప్పుడు నీవే శరణ్యము!

ద్యుమ: దేవీ! పరమేశ్వరానుగ్రహముననే రాజ్యభ్రష్టత గలిగె—ఇంక నా కిట్టిడిదైనము శత్రులకుగాక మన కేల మేలు సేయును?

విన : దేవా! వాఁడు రాకమున్న తమ రాసనంబు నవతరించి వాని నెదుర్కొన సంసిద్ధులై యుండుఁడు.

ద్యుమ: మంత్రీ! ఇప్పు డంతకన్నఁ గర్తవ్యము లేదు. (లేచును)

[ "మును నాతండ్రి వరాభవించిన" అను పద్యము జదువుచు చిత్రకేతుడు మేధావి, పరివారములతో — ప్రవేశము ]

చిత్ర : ఓహో! పరివారములారా! మీ వృద్ధరాజేంద్రుఁ డెక్కడ? ఆ తుచ్ఛుని నేత్రోదిత రక్తధారలచే మత్పితరునకు రక్త

తర్పణం బొనరింప చిత్రకేతుఁడను నేను వచ్చితిని. రాజాగ్రహ భయావిష్టులై మూలల నొదిగితి రేని, మీ కందఱకును నేఁడు సంఘమరణంబు సంఘటిల్లు.

మేధా: దేవా! వా రంద ఱిక్కడనే భీతావహులై యెన్నఁడో చచ్చిన ట్లొదిగియున్నవారు.

చిత్ర : (తేఁగిచూచి) ఓహో! ఆగ్రహావేశంబున, నా ప్రియమిత్రుని యందు నే నెంత యపచారంబు సల్పితిని?........ఓ ద్యుమ త్సేన మహారాజా! జరాభరంబునకు భయజ్వరంబు తోడై సుడిగాలికి రావియాకు చందంబున నేల వడవడ వణకెదవు? నేను రాక్షసుండను—త్వ త్సేనా సహస్ర కంఠ రుధిర చందన లిప్త వికృతాంగుఁడను—నీ వైరి కుమారుఁడఁ జిత్రకేతుఁడ!—

మ. బలగర్వంబునఁ గన్నుఁ గానక గడుం బ్రార్థింప నాతండ్రి నీ
వలతిం జూచి పరాభవించితివిగాదా మున్ను దుష్టాత్మ నీ
కలగర్వం బడఁగింపవచ్చితిని వీకంగల్గినం బోర రా
తులువా నీతలఁ దన్నువాఁడ నిదె సంధు ల్వీడ పాదాహతిన్.

[ ద్యుమత్సేనుని తలపై దన్నును ]

విన : (తనలో) ఆహాహా! కాలమహిమ! మూర్ధాభిషిక్తుఁ డగు మహారాజున కెంత పరాభవం బగుచున్నది!

భవా: (తనలో) కటకటా! దైవమా! ఈ దుర్దర్శనమునకా పాపాత్ము రాల నగు నన్ను చిరంజీవినిగాఁ జేసితివి.

ద్యుమ: (రోషముతో) ఓరి పశుప్రాయా! రాక్షస ధర్మచింతనా! చిత్రకేతూ! క్షత్రియోచితంబగు పరాక్రమమున నేను నీ తండ్రిం బరాభవించినందులకా నీ వి ట్లనర్థంబుగ, నా శిరముం దన్నితివి! రాజన్యమూర్ధముం దన్నుట రాజనీతి యఁట్రా తులువా! రాజధర్మానుసారంబుగ రాజ్యంబు చేకొంటివి. అంతతో బోవక నీ కీ దురాచరణం బేల?

చిత్ర : ఛీ! తుచ్ఛుఁడా! నా కిప్పుడు నీవు నీతుల నుపదేశింపఁ బోవుచుంటివా! ఈ సృగాల గతోపదేశంబులకు నీ నాలుక గూడ తెఱుగఁదగినదే. సైనికులారా! చూచెద రేమి? వీనిం బట్టి బంధింపుఁడు.

విన : (ఆగ్రహముతో) ఓరీ! చిత్రకేతు పాతకా! ఈ వినయశీలుఁడు జీవములతో నుండ నీవు మా మహారాజును బంధింపలేవు. నీ ప్రాణంబులఁ దీసెద చూడుము. (మీఁది కుఱుకును)

మేధా: (అడ్డుపడి కరవాలము లాగికొని) ఓరీ యసమర్థా! ఇంక నేమి ప్రేలెదవు! చచ్చిన ట్లొకమూలఁ బడియుండుము. వీని కింకను మహారాజపద మెక్కడిది? మీ రందఱు నేఁ డూర కుక్కలకు తిండి గావలసి యున్నారు. సైనికులారా! ఈ పాపుల బంధింపుఁడు.

[ ద్యుమత్సేనుఁడు, వినయచంద్రుడు పెనుగులాడుచుండ సైనికులు వారిని బంధింతురు ]

ద్యుమ: (రోషముతో) ఓరీ దుర్మతీ! దుష్టా! శూరకుల కళంకా! ఆఱునెలలు సాముచేసి మూలనున్న ముసలిదానితోఁ బోరినట్లు శతవృద్ధునై కాటికిఁ గాలుసాఁచుకొనిన నన్నా నీవు బంధించి వీరుఁడ నని విఱ్ఱవీగుచుంటివి. ఈ రాజ్యము నీకు శాశ్వతమని నమ్మితివా! నన్ను నిర్జించువాఁ డొక్కఁ డేనాటికైన రాఁడా! నీ పాపము పండదా? నీ శిరంబు సకలీభూతంబై పోవ— నీ సతుల మంగళసూత్రంబులు తెగ—నీ మరణంబునకు సుర లానందింపరా! అకటా! రాజధర్మమున కెంత కళంకముఁ దెచ్చితివి! ఇప్పటి కీశ్వరుఁడు నీ పాలనుండుటచే బ్రదికితివి! ఎంతకాలము నీ యాటలు సాగివచ్చును?

చిత్ర : ఛీ! ప్రేలకుము! బంధించుటతో నిన్ను వదలితినా! నీ గ్రుడ్లు దీసి నీ సతిం బరాభవించినఁ గాని నాకు సంతృప్తి గలుగదు. (కత్తి చేకొని పై కుఱుకును)

మేధా: (వారించి) మహాప్రభూ ! ఈ దారుణకర్మమును శుభాకాంక్షు లగు తమరు చేయఁ జనదు. స్త్రీ జనావమానము సయితము నీచవృత్తి యైనందున తమ రాదారిం బోఁజనదు.

చిత్ర : అట్లయిన నిప్పుడు మన కేది కర్తవ్యము ?

మేధా: ఆ వృద్ధదంపతుల నిద్దఱను పరిజనులచే నరణ్యంబుల కంపి అందీ ముదుసలిగ్రుడ్డు ఖీయించుటయుఁ గుటిలమతియగు నీ మంత్రిని గారాగారమున బంధించుటయు నవశ్య కర్తవ్యములు.

చిత్ర : అట్లే యాచరించువాఁడను. పరిజనులారా ! ఈ దంపతుల నడవిని విడిచి వీని గ్రుడ్లుదెచ్చి మాకుఁ జూపవలయును, ఓరీ తుచ్ఛ రాజభూతమా ! ఇఁక నడవిలో దిక్కులేక నంధుఁడవై మరణింపుము. పొమ్ము. (తన్నును)

[ ద్యుమత్సేనుడు అనుబంధము 1 పాడిన పిదప సేవకులు రాజదంపతులతో నిష్క్రమింతురు ]

చిత్ర : ఓరీ పరిజనులారా ! ఈ మంత్రిని కారాగృహమం దుంపుఁడు.

[ వినయచంద్రుని సేవకులు వెంటనిడుఁగొని నిష్క్రమింతురు ]

చిత్ర : మంత్రీ ! ఇప్పటికి నా మనోరథం బీడేరినది ! మన మీా రక్తాంబరములను వదలి మంగళస్నానంబు లాచరించి పట్టాభిషేక ముహూర్తం బాలోచింతము రమ్ము—

ఆ. వె. కన్నతండ్రి చరమ కాలంబునాటి కో
        రిక లెవండు దీర్చు ప్రీతిమీాఱ
        వాఁడె నిక్కమైన వరసుతుం డాతని
        కభ్యుదయము లమరు నవనియందు.

[ అందరు నిష్క్రమింతురు ]

అవనిక జారును



# సంగీత సావిత్రి

## ద్వితీయాంకము

### 1 వ రంగము

ప్రదేశము — ఉద్యానవనము

[ సత్యవంతుడు, సుమాలి — ప్రవేశము ]

సుమా: మిత్రమా! నేటియుదయము నుండియు, నీ హృదయము చింతాకులమై యున్నది. కారణముం జెప్పుమన్నఁ జెప్పవు గదా! వేగముగ నడిచితిమేని యింక మూఁడునాలుగు దినములలో మన మూరు చేరవచ్చును. తల్లిదండ్రులపై నింతలో బెంగఁ బెట్టుకొనెద వేమి?

సత్య: మిత్రమా! సుమాలీ! నా చింతకుఁ గారణ మేమో నాకు సయితము బోధపడకున్నది. హృదయమున నేమోకాని యాందోళనముగ నున్నది. ఇంటిపై మనస్సు పారినది. పలుసారులు నా వృద్ధజననీజనకులు కన్నులలో మెదలుచున్నవారు. ఎంత యానందదృశ్యమును వీక్షించినను, సంతసం బొదవకున్నయది—

గీ. విడిచివచ్చితి నొంటిగ వృద్ధులైన
వారి మాతాపితల గృహాభ్యంతరమునఁ
గంటి కదియేమొ పలుమారు గానుపించు
చుండి రీనాఁడు హృదయ సంక్షోభకముగ.

సుమా: ఎన్నఁడును వారిని నీవు గడిష్ఠమైన ... నుండని కారణమున వియోగము మిగుల దుర్భరమై యుండఁబోలు ; అంతియకాని మఱేయొండరును గల్గియుండరు. సత్యవంతుఁడ వైన నిన్నీశ్వరుఁడు సదా పరిపాలించునుగాక !—మిత్రమా ! సత్యవంత ! ఈ ప్రమదావనం బెవ్వరిదోకాని రమణీయ సౌందర్యప్రభాభాసురమై యున్నది చూడుము. ఇందువలన నీ కలత యణఁగ వచ్చును.

సత్య : నా పాదములును నడిచినడిచి యూవంత బలహీనములైనవి. శ్రమాపనయము కొఱ కిందుఁ గొంత విహరింతము రమ్ము.

[ ఇరువురు నిష్క్రమింతురు ]

[ సరస్వతీ. సావిత్రి — ప్రవేశము ]

[ అనుబంధము 2 ]

సావి : చెలీ ! సరస్వతీ ! ఇనుఁ డుదయింపఁగనే యీ పద్మిని మొగం బెంత కళకళ లాడుచున్నదో చూచితివే.

సర : అమ్మా ! అది ప్రకృతిసిద్ధము సుమా !

సావి : సఖి ! ఇంతేకాదు. ఈ పద్మినీమత్తకాశిని యెంత పతి సన్నిధానాభిలాషోన్మత్తయో కాని, చూఁడు—

చ. అనుపమ మోదమందు నుదయించున నాధునిఁ గాంచినంత నా
యినుఁ డపరాద్రిచాటునకు నేగిన నెమ్మది మోదమార నా
ననమునువంచి సంభ్రమమునన్ వెతఁజెందు ; శశాంకుఁ డెంతపా
రణ మొనరించినన్ మది గరంగదు పద్మిని యెంతసాధ్వియో.

సర : సఖి ! సావిత్రీ ! ప్రకృతిపత్రంబులనుండి, పతివ్రతాధర్మంబులను జదువుశక్తిగల నీ విజ్ఞానసంపద కడుంగడు సంస్తుతిపాత్రమై యున్నది. అనురూపవరునిఁ జేపట్టి, నీవు పతిహితవర్తనం బ్రవర్తిల్లి మహాపతివ్రతలలో నొకతెవై పేరందుదువని నాకుం దోఁచుచున్నది.

సావి : సరస్వతీ ! నీ ముఖస్తుతుల కేమిగాని—ఈ పద్మినీ సత్యానుసరణ మార్యసమ్మతమే కాని, పతి యస్తంగతుఁ డైనప్పుడుమాత్ర మీమె యుక్తముగఁ జరింపకుంటుట కొంతొక కళంకమని తలంతును.

సర : ఎందుచేత—

సావి : ఇనుఁ డస్తమింప నీ పద్మిని తనతావునుండి కదలక యుదాసీనతం జూపినది.

సర : చూపక—ప్రపంచమునం దందఱు నేమిచేయుచున్నారు ?

సావి : నేను ప్రాకృతులందఱిమాటయా చెప్పుచున్నది ? పతివ్రతయైనది పతి యస్తమించినను వెన్నాడిపోవలసినదే !—

సర : అమ్మక చెల్ల ! నీది మరీవిపరీతముగదమ్మ ! పతితో నెక్కడికిఁ బోఁగలదు ?

సావి : వెఱ్ఱిదానా ! ఆత్మకు నాశనమెక్కడిది ? పతియాత్మ యెంత దూర మరుగు నంతదూరము సతి యరుగవలసినదే !

సర : చాలులెమ్మక; లోకాతీతంబులగు నీనుడువులుమాని ప్రొద్దెక్కకుండఁ బూవులుగోసి మాలికలుగట్టుకొని ఇంటికిఁ బోవుదము. సావిత్రీ దేవి పూజ కాలస్యమగును. (పూవులు కోయుదురు)

[ పొదలచాటుననుండి సత్యవంతుడు — ప్రవేశము ]

సత్య : (తనలో) ఈ వనంబున నెవ్వరో కాంతలు సంచరించుచున్నారు. ఎవరైయుందురు ? ఇందొకతె యజమానురాలును, రెండవది సఖియునని తోఁచుచున్నది. అయ్యారే ! ఏమి యీ సుందరి యందము !

[ అనుబంధము 3 ]

ఉ. చూడని తావులంగల ప్రసూనము ; సూచి ముఖాగ్ర దేశముం గూడని మానికంబు ; నళికోటులు తాఁకని పూవుఁదేనె ; నా నాఁడు ప్రవర్ధమానమగు నాతి మహత్తర రూపభాగ్య మే వాఁడు భుజింపఁగా నలువ వ్రాసినవాఁడో ? లలటమందునన్.

ఈ లతాకుంజముల చాటుననుండి [illegible] సంభాషణం బాల కించితినేని, వీరి వృత్తాంతంబు దెలుపఁగలము.

సావి : ఓసీ సరస్వతీ ! ఈ జపావృక్షము మానవతులను పదిలంబుగఁ దాచు శుద్ధాంతఁబుపగిది గంటకావృతమైయున్నది చూచితివే!

సర : ఔనమ్మా ! అందువలన దాని కంతటిగౌరవము. పాలాచకుసు మంబువోలె బహిరంగచారిణి యగు నింతి కేటిగౌరవము ?

సత్య : (తనలో) తేనియలసోనలై—మకరంద రసధారలైన ఈ చెలువ చిలుకపలుకులు వినుటచే నా శ్రవణంబును, పరువఁబునకురాని దాడిమీబీజంబుల నెకసక్కెమాడుచు, ముత్తియంబు కోవలైన పల్వరుసలం గాంచుటచే నా కన్నులును నిక్కముగా ధన్యతఁ గాంచినవి. ఈ కాంత భూలోకకాంతయో—కిన్నర సతియో—

సీ. అమరపల్లవపాణి యందునా ? సుందరి,
యల్లవల్లన రెప్ప లార్చెనదిగో
తోయజాతాక్షి విద్యుల్లత యందునా ?
లేదు చాంచల్య మీలేమ కెందు
పదియాఱువన్నియ బంగార మందునా ?
కలదు చైతన్య మీకాంతయందు
అలరువిల్తునిముల్కి యని నిర్ణయింతునా ?
నిసితభావంబు గాన్పింపదెందు

జాఱుపయ్యెద నొకచేత సంతరించి,
కమలవిభ్రాంతి మొగముపైఁ గదలియాడు
నళులఁ గసరుచుఁ బూవు లందందుఁ గోయు
కామినీమణి మానవకాంత నిజము.

సంభాషణాకర్ణనంబున నీమెచరిత్రం బానుపూర్వకముగ నెఱుంగఁ దలంచితిఁగాని, ఫలోన్ముఖము గాదయ్యె —

సీ. మెలమెల్లఁ బరతెంచు మేల్కటాక్షములచే
నల్లకల్వలదండ లల్లియల్లి
విరుల నన్వేషించి తిరుగు సారంగంబు
లను దనముఖపద్మమున మరల్చి
గొనబు ముత్తెంబుల కోవలో రదనాల
మల్లెపూవులచాలు నుల్లసించి
నిగనిగల్ వెలయించు నెమ్మేనికాంతి పూఁ
బొదల మేలుపసిండి పూఁతఁబూసి

మారుఁడే త్తిన మేటికటారి యనఁగ
నిలను విహరించు సచ్చంద్రకళ యనంగ
వరునికై మూర్తిఁ గనువనేందిర యనంగ
నిలిచియున్నది వనమందు నెలఁతమిన్న.

పరసతీ చంపక సారంగం బగు నా యంతరంగం బీకాంతదృష్టి కకారణంబుగఁ జొరబారుటఁ జూడ పరమాశ్చర్యకరంబుగ నున్నది. ఇందుల కేదియో మహత్కారణం బుండియుండును. ఇంతకు నీమె వివాహితయో ? యవివాహితయో ? డెందమా ! తొందరపడకుము. సర్వముం దేటపడఁ గలదు.

సర : సఖి ! సావిత్రీ ! జనకుఁడు, నీ కల్యాణంబు నింక రెండు సంవత్సరంబులు దనుక నిలిపివేయుటచేత మన విద్యా వ్యాసంగం బవిచ్ఛిన్నంబుగ సాగగలదని నాకు ధైర్యంబు గలుగుచున్నయది.

సావి : ఇప్పుడు నీకీ యప్రస్తుత ప్రసంగమేల ?—పూవులెన్ని గోసితివి ? (చూచి) ఏవీ ? ఇంతేనటే నీవు గోసినవి !—పెండ్లిండ్లని పేరంటములని పడుచుదనపు తలఁపులలోఁ బడి పూవుల నాలస్యముగఁ గోయుచుంటివా ! చూడు మెంతమెంతబడలితివో.

సర : అబ్బ ! నీవు ముసలిదాన వైతివి కాఁబోలును ?

సత్య : (తనలో) ఇప్పటి కీమె యవివాహిత యని తెలిసినది. అట్లైన
నా మానసం బధర్మచింత గావింపలేదు—

ఉ. ఆతఁ డదృష్టశాలి, సుకృతాంగుఁడు, ధన్యచరిత్రుఁ డాతఁడే
యేతని వంశపుంగడలి నీయమ యిందిరగా జనించెనో
యాతఁడె దివ్యలోక విభవాతిశయంబునఁ దేలు భవ్యుఁ డౌ
నేతని పాణిపంకజము నీయమ తా గ్రహియింపఁ గల్గునో.

పిత్రునామంబును నోట నక్కాఱింపదయ్యెగా ! ఓ సఖీ !
సరస్వతీ ! అప్రస్తుతంబని సావిత్రి ఆక్షేపింప నెట్టిమె కన్యాత్వ
మును బహిరంగపఱచితివో యటులే పితృగృహంబును సయిత
మెఱింగింప నీకుఁ గరుణగలుగదే ?

[ తెరలో పెద్దధ్వని ]

సావి : (భయముతో) సఖీ ! సఖీ !—ఇదియేమి ? హృదయవిదారక
భీషణనిర్ఘోషంబు నా శ్రవణతాడితం బగుచున్నది.

సర : (భీతితోఁ జూచి) అమ్మయ్యో! ఇంకేమున్నది ? భయంకరముగ
నొక్క దుష్టశార్దూలము బోనునుండి బయటఁబడి యీ వంకకే
వచ్చుచున్నది. వనపాలకు లందఱును దిశలఁ బరతెంచుచున్న
వారు !—ఎవ్వరు మాకు దిక్కు ?—సఖీ ! సావిత్రీ ! సావిత్రీ !
అయ్యయ్యో ! మూర్ఛిల్లి యున్నది !—ఓ దీనదయాపరులారా !
అనాథులమగు మమ్ముఁ గాపాడి పుణ్యముం గట్టుకొనుఁడు.

సత్య : (కత్తిదూసి ప్రకాశముగా ఆగ్రహముతో) ఓ దుష్ట
శార్దూలమా ! నిలు నిలు !—

చ. దుడుకుతనంబున న్సహజ దుర్మతబుద్ధిని బంధనంబు వె
ల్వడి పటుభీకరాకృతిని, వక్త్రము విప్పి, మనుష్యజాలమున్
బొడవడగింప నెంచితివె ? భూరిభుజాబలమొప్ప నీ మదం
బడఁగఁగఁజేతు నొక్క నిమిషార్థమునందున నో వృకాధమా.

[ నిష్క్రమింతురు ]

సరి : అమ్మయ్యా! ఇప్పటికి నాగుండె లోనెంత కుదుటంబడినది. పరమేశ్వరుండే యీ రాజకుమార రూపంబున నవతరించి మా ప్రాణరక్షణం బొనరించెనని తోచుచున్నది. (తెరవంకం జూచి) ఆహా! ఎంతపరాక్రమమును బ్రదర్శించుచున్నాండీ మహా పురుషుండు! తనపై కుప్పొత్తుగ నవసిన శార్దూలంబు నోరు వెకలించి చీల్చి చంపుచున్నవాడు. కటకటా! శార్దూలంబు సమసెనను నానంద మీబాల మూర్ఛతోం దీరుచున్నది.

[ ఖడ్గహస్తుడై సత్యవంతుడు — ప్రవేశము ]

సత్య : మానినీమణీ! మీపైం గవసిన శార్దూలంబును సంహరించితిని; ఇంక మీరు సేమంబున నింటి కరుగవచ్చును.

సర : మహాత్మా! మూర్తినిం దాల్చిన శౌర్యావతారులగు తమచే నేడు రక్షింపంబడితిమి; మీ ఋణంబు దీర్చుకొను నుపాయంబు లేదు గదా!

సత్య : లతాంగీ! నే నీ కార్యమును మీ స్తుతి నభిలషించి యొనరింప లేదు. కావున నిందుండి మీరు గృహంబున కరుగుండు.

సర : అయ్యా! మాంచెలి ఇంకను మూర్ఛదేరలేదు. ఒక్కనిముసము మీ రిందు దయామతులై యీమెం గనిపెట్టియుండు రేని నేను పరిజనులం గొనివచ్చెదను.

సత్య : అటులే కానిమ్ము. [ సరస్వతి నిష్క్రమించును ]

సత్య : ఆహా! ఏమి యీ రమణి తనూవిలాసము!—

సీ. పగటిచంద్రునివోలె వసివాడియున్న నె
మ్మోమున నింకెంత మురువు గలదో?
అరమూతనున్న నేత్రాంబుజ సౌందర్య
మీ విలాసంబు నింకెంత గలదో?
కడువేడి నిట్టూర్పు గాలిని వసివాడు
నీమోవి భాగ్య మింకెంత గలదో?
బడలి భీతిని గుండె తడబాటునం జలించు
నీయురోజోన్నతి యెంత గలదో?

కోమలపాణి ధీర కలవాణి శుకవాణి
లలిత శుభకపోలముల మిటారి
కులుకుమించు జఘన గుమనీము గలభామ
నువిడఁ గౌఁగిలింప శుండఁగలనె?

(కౌఁగిలింపఁబోయి వెనుకకుఁ దగ్గి) కటకటా! ఏమి నా మంద బుద్ధి! అనేక భటపరిరక్షితాసాధ్య దివ్య సౌధాంతరాళంబున వసియించు మించుఁబోఁడి పేత్వాంతరమున నీకాంతారముం జొచ్చి దుష్టశార్దూలభీతిఁ గష్టంబునందినఁ బరిరక్షించిన నాకీ లఘువీక్షణంబు తగునే?—ఆహా! ఈ లేమ కదలుచున్నది. పరపురుషుండ నగు నన్గాంచి యేమని భావించునో కదా!

సావి: (ఉలికిపడి లేచి) చెలీ! సరస్వతీ! చెలీ సరస్వతీ!

సత్య: కల్యాణీ! మీపైఁ గవసిన శార్దూలంబును నేను సంహరించితిని. సరస్వతీ పరిజనులకై చనినది నీవు భీతి నొందకుము.

సావి: (తనలో) ఆహాహా! కన్నుల కొక్కుమారుగఁ గోటిసూర్యులు ప్రకాశించిన చందంబున భ్రాంతి యావహిల్లె! మేనెల్లఁ బుల కాంకురములు వొడమె! ఎవ్వ రీ మహానుభావుఁడు?—

గీ. మేనఁ బులకాంకురంబులు గానఁబడియె
చల్లనై యున్న గుండెలు జల్లుమనియె
ఫాలతల మంతయును జెమర్పఁగఁ దొడంగె
కన్నులీమహాపురుషునిఁ గాంచినంత.

సత్య: మానవతీమణీ! పరపురుషుండని నీ మదిఁ గొందలపడఁ జనదు. నే నన్యులవంటివాఁడఁ గాను.

సావి: (ప్రకాశముగా) మహాపురుషా! అవ్యాజకరుణాతిరేకంబున మమ్ముం గాపాడితిరి. మీ దయారసంబును గొనియాడుటకైన సమర్థత లేనిదానను గదా!

సత్య : పొగడ్తల కవసరం బేమిగలిగె? విధ్యుక్తంబగు నా కార్యం బాచరించితిని. ఇం దధిక మేమియును లేదు.

సావి : క్షమాగుణ సంపన్నులగు తమ రట్లు తలంచినను, మాకు మే మెంతో ఋణపడి యుంటిమి.

సత్య : సాధ్యమగు నెడల నెప్పటికైనఁ దీర్చుకొనవచ్చును.

సావి : (తనలో) ఈయన యాకృతి నృపకుమారునిదివలెనే యున్నది. ఐనను కులశీలనామాదులం బ్రశ్నింతునా? ఏమిగా భావించునో!

సత్య : (తనలో) నాకీమె నామం బొక్కటి దక్క యన్యంబేమియు నెఱుంగ రాదయ్యెను. ప్రశ్నించిన నేమనుకొనునో !

[ సరస్వతి — ప్రవేశము ]

సర : అమ్మా ! సావిత్రీ ! పరమేశ్వరానుగ్రహమున మూర్ఛ దేరి సుఖముగ నుంటివా !

సావి : ఈ మహాత్ముల కృపారస ప్రభావమున—

సర : ఔను, నేఁ డీయనయే మనపాలిటి పెన్నిధానమై రక్షించెను. కానిచో నేమైయుండుమో—పరిజను లాందోళికం దెచ్చి యుంచినారు. మహాభాగా ! మే మింక మీ సన్నిధినుండి యరుగక తప్పదు. ప్రాణదాతలగు మిమ్ము మే మెన్నండును మఱవఁజాలము.మాపైఁ గృప యుంచుఁడు ; మరల శీఘ్రకాలమునఁ బునర్దర్శనమగుఁగాక ! సావిత్రీదేవీ ! రమ్మ.

సత్య : మీకు శుభంబగుగాక !—

[సావిత్రి సరస్వతితో నిష్క్రమించుచు, సత్యవంతునివంక వెనుక వెనుకకు చూచుచు, నిట్టూర్పు విడుచుచు నిష్క్రమించును. సత్యవంతుడు తదేక దృష్టితో చూచుచు అనుబంధము 4 పాడును]

గీ. తరుణితోడనే నాదృష్టి తరలిపోయె
యేగుచున్నది ప్రాణ మా యింతితోడ
తమము వ్యాపించె జీవచ్చైతన్య ముడిగె
కదలలే కిందు నిలిచితి గట్టెవోలె.

[ సావిత్రీ సరస్వతులవంకకే చూచుచు సుమాలి — ప్రవేశము ]

సత్య : ఓహో ! సుమాలియాయేమి ! ఓయీ ! మిత్రమా ! నీ వింత దనుక నెందుంటివి ?

సుమా: చాలుచాలు ! గొప్పమిత్రుఁడవులే ! ఇప్పటికైనఁ బరామర్శించితివే ! సంతసించితిని.

సత్య : మిత్రమా ! ఏలనో నిష్ఠురము లారంభించితివి !—

సుమా: నీ కీమాటయే నిష్ఠురముగ నున్నప్పుడు—పెద్దపులినోట నన్నుఁ బడవైచి, నీవిందు శృంగారనాటక ప్రదర్శనము చేయుట నా కెంత నిష్ఠురముగ నుండునో యాలోచింపవైతివిగదా !—

సత్య : ఔనౌను. మఱచితిని. శార్దూలము విడివడినప్పుడు నీ వెందుంటివి ?

సుమా: ఎందుంటిని ! తెలివిగలవాఁడను గావున నే నొక చక్కని విధమునఁ బ్రాణరక్షణముఁ జేసికొంటిని.

సత్య : ఏమిచేసితివి ?

సుమా: ఒక్కచో నొక్కగొంగడి నాకంటికిఁ గాన్పింప నందు నిరపాయముగ దూరితిని.

సత్య : అందు సుఖముగ నిద్రించియుందువు.

సుమా: పెద్దపులివలనఁ బుట్టినభీతి మనస్సులో నుండఁ గంటికి నిద్ర వచ్చునెట్లు ?—

సత్య : నిద్రాదేవి నిన్ను తన కరములఁ గౌఁగిలించి మానస భయంబు మఱపించును గాదా !

సుమా: నీవనినమాట కొంత నిజమే కాని, నాకు వెంటనే వేఱొక భయము గలిగినది.

సత్య : అది యేమి ?

సుమా: నేను గొంగడి యనుకొని దూరినది గొంగడి కాదు.

సత్య : కాక మఱేమి ?

సుమా: ఎలుగుబంటి—

సత్య : అబ్బా ! ఎంత ప్రమాదము ! అది నిన్ను గోళ్ళఁజీరి చంపలే దేమి ?

సుమా: నేను చంపనిత్తునా ? అప్పు డొక పెద్ద యుపాయమునఁ దప్పించుకొంటిని.

సత్య : ఏమి చేసితివి ?

సుమా: అది యెలుగుబంటి యని తెలిసినతోడనే పరువెత్త నారంభించితిని.

సత్య : అయ్యయ్యో ! అది పారిపోవువారి వెంటఁబడు స్వభావము గలదిగద !

సుమా: దాని మొగము ! దాని శరీరమునఁ బ్రాణము లున్నగద !

సత్య : సరిసరి ! చచ్చిన యెలుగుబంటియా ?

సుమా: అప్పుడు చచ్చిన దనుకొంటివా యేమి ! ఎప్పుడో చచ్చిన యెలుగుబంటి చర్మము.

సత్య : (నవ్వుచు) భళీ ! నీ ధైర్యము మిగుల మెచ్చఁదగియున్నది. తరువాత ?—

సుమా: అది యెలుగుబంటి చర్మమని ధృవపడిన తరువాత మఱల పెద్దపులి భయము నన్ను పీడింపసాగినది !—ఇంతలో నీవు దానిం జంపుచుండ చాటుననుండి చూచితిని.

సత్య : అట్లయిన నింత యాలస్యముగ వచ్చితివేమి ?

సుమా: దానిని నీవు చంపితివనుమాటయే కాని, యది కోటలు తెలిచుకొని బ్రతికినట్లే యుండెను. బ్రతికినదో చచ్చినదో యను సంశయము తీరక—దానిం బరిజనులువచ్చి లాగుకొని పోవునంతదనుక—దాగియుండి, మెల్ల మెల్లగా నిప్పుడు భయవర్జితుండనై ఇటు వచ్చితిని. సత్యవంతా! ప్రొద్దుబోని నాగోడవకేమిగాని, నే నొకటి యడిగెదను చెప్పెదవా ?

సత్య : ఏమది ?

సుమా: ఆ కాంతలెవ్వరు ?

సత్య : ఏకాంతలు ?

సుమా: ఇంతదనుక నీతోం బ్రస్తావించుచు నిప్పుడటు చన్న కాంతలు.

సత్య : ఎవ్వరో పాపము పుష్పాపచయము గావింప నిందువచ్చి శార్దూల భయపీడితులు కాంగా—వారిభయము దీర్చి పంపుచుంటిని.

సుమా: అంతేనా ?

సత్య : ఏమనుకొంటివి ?

సుమా: ఏమనుకొంటినో చెప్పుమందువా ? పెండ్లికొడుక వైతివను కొంటిని.

సత్య : సుమాలీ ! ఏమిమాటలాడితివి ?—విశేష మేమైన నున్నదని భ్రాంతినొందితివా యేమి ?

సుమా: విశేషమా ? విశేషమా !—విశేషమంతయు నశేషముగ నా కంటం బడినదిలే ! నీ వేమి దాచెదవు !

సత్య : నీ కంట నేమి పడినది ?

సుమా: ఒంటరిగిదానంజేసి, మూర్ఛిల్లిన యా నాతి మోముపై మోముంచి నీవు—

సత్య : సుమాలీ!—చాలును. నీకడ దాచినందువలన నేమిలాభము? ఆ సుందరాంగి నిశితకటాక్షంబు మారుని కటారివోలె నా హృదయంబున నాటి బాధించుచున్నది. మదనుఁడు విష లిప్తంబులగు శరంబుల నొప్పించుచున్నవాఁడు. అట్టి జగన్మోహనాంగి నీ పదునాల్గు జగంబుల గాలించినను గనఁజాలము సుమా సుమాలీ!

సుమా: సరిసరి! నే ననుకొన్నంతపని యైనది. ఆ కాంత నీమెదడున విషబీజములం జల్లిపోయినది!—నీ బుద్ధి యిప్పుడు కప్పను మ్రింగిన పామువలె నడుచుచున్నది. ఒక్క గంటక్రిందట గృహంబున కరుగ నాతురపడిన నీ విప్పుడీస్థలమున నే విడువఁ దలచుంటలేదు.

సత్య : సుమాలీ! నే నట్టి వ్యామోహంబునకు లోఁబడుచుంటినని తలంచితివా యేమి?—లోకాతీతమైన సౌందర్యరాశిం జూచి నందున నా మనస్సించుక స్తబ్ధమైన మాట నిజము ఇది నా యొక్కనితలనే వ్రాయఁబడినదా! "బలవా నింద్రియ గ్రామో। విద్వాంస మపికర్షతి" యని పెద్దలు పలుకరా!—

సీ. చంద్రమండలము నాస్యంబొనర్చియుఁ దక్క-
శంకంబు నెఱికురులను నమర్చి
కంబుగ్రాజంబును గంఠంబుగాఁ జేసి
ధావళ్యమెల్ల దంతముల నిల్పి
యమలప్రవాళంబు నధరంబుగా సల్పి
కాఠిన్యమును రోజపీఠి నిల్పి
కుంభి కుంభముల నితంబముజ్జేసి త
న్మాంద్యంబు గమనంబునను దగిల్చి

చేసెఁ గాఁబోలు నలువ విశేషబుద్ధి
శాలియై బహువర్షంబు లీలఁదాంగి
నిట్లు గాదేని యీ యంద మీ బెడంగు
గలిగియుండునె సామాన్య కామినులకు.

సుమా: సరేకాని, మన మింక శీఘ్రముగ నావలఁ బడకున్నఁ గార్యము లేదు. నీ సంగతియంతయుం జూడఁగా నీ వీ యూర పీఠము వేయునట్లు గనంబడుచున్నది.

సత్య : అట్లయిన నడుతము రమ్ము. (నెమ్మదిగా నడచును)

సుమా: మిత్రమా! నీ పాదము లీ మాయామోహ భూమిని వదలి రా నొల్లకున్నటు లున్నవి.

సత్య : మిత్రమా! నీ పరిహాసముల కేమిగాని, విను విను—దూరమున సంగీతధ్వని.

సుమా: ఎవ్వఁడో యొక్క బడుగుసన్యాసి, భుజమున నొక్క చిటారు బూని యేదియో పాడుచున్నాఁడు.

సత్య : వెఱ్ఱివాఁడా! బడుగుసన్యాసి యని యాక్షేపింపఁ దగదు. అతఁడు మహాత్ముఁడగు నారదమహర్షి.

[ నారదుడు— ప్రవేశము ]

సత్య : మహర్షి కభివాదనము.

నార : కళ్యాణమస్తు. బాలకా! నీవు చిత్రాశ్వనామాంతరంబున నొప్పారు సత్యవంతుఁడవు గావా?

సత్య : మహాత్ముల కెఱుంగరాని దేది?

నార : అకటకటా! పాపము నీ వంశంబునకుఁ గల్గిన, మహావిపత్తును, నీ జననీజనకుల ఘోరదుర్గతియు నెఱుంగక, నీ విట్లానందముతో నుంటివా!

సత్య : (తత్తరముతో) మహాత్మా! ఏమిది?—నా జననీ జనకుల ఘోరదుర్గతి యేమి? సంపూర్ణముగ నెఱింగించుదనుక నా మతి తల్లడిల్లుచున్నది.

నార : ఇఁక సంశయింపనేల—వినుము—

గీ. చిత్రకేతుం డనెడు రాజశేఖరుండు
పూర్వవైరంబు మదిఁ దలపోసి రాజ
సర్వమును హరియించి నీ జనకు నడవి
గ్రుడ్లు దీయించి దుర్గతి గూర్చెనయ్య.

సత్య : హా! జనకా! హా! పుణ్యశ్లోకా! హా! పుత్రవత్సల! (మూర్ఛిల్లును)

సుమా: అకటకటా! ఎంతగతి ప్రాప్తించెను?—హా! ద్యుమత్సేన మహారాజా! కుమారుఁడు దగ్గర లేకుంటఁగదా! నీ కీ దురవస్థ గల్గినది?—విధి నీ కెంత ప్రతికూలముగ నున్నవాఁడు!

సత్య : (మూర్ఛదేరి) హా! తండ్రీ! శతవృద్ధా! ఏకపుత్రప్రాణైక జీవన!—దురాత్ముఁ డగు చిత్రసేనహాతకునిచే, ఘోరంబుగ గ్రుడ్లుదీయింపఁబడి మహారణ్యములపాలై—నీ కుండియు లేని నన్నుఁ దలంచుకొని మిగుల వగలం బొగులుచుంటివా!—నేను పురంబున లేనితఱి జూచుకొని యా నీచుండు నీపైఁగల క్రోధంబు పూర్ణముగఁ దీర్చుకొననెంచెగా!—రాజ్యభ్రష్టత చేకూరినఁ జేకూరుఁగాక! దౌర్జన్యంబున నా నీచుండు మరణాసన్నుండవగు నిన్ను గారించి కన్నులు చల్లబడఁ జేసికొని యెనా! తండ్రీ!—అంధుండవై యక్షిబాధా ప్రపీడితుండవైన నీ వింక జీవించి యుందువా! నీవు దుర్గతులపాలై—శత్రుకృతాభీల ఘోరపీడనంబు లందుచుండ నేను సుఖంబుగ నుండి నీ శోక మార్పఁజాలని నిరర్థకజీవనుండనైతినిగదా—!

ఓరీ ! చిత్రకేతుహతకా ! సత్యవంతుఁడు పురంబున లేనితఱి వేచి దురితం బాపాదించిన నీ మరణం బతిసన్నిహితంబై యున్నదిరా ! దుష్టా !—

ఉ. ఏమని యెంచి నా జనకు నిద్ధచరిత్రుని నంధుఁజేసి ని
ర్ధూమ మహోగ్రహవ్యశిఖరోచుల నుజ్జ్వలియింపఁ జేసినా
వీ మదవైరివారణ మృగేంద్రుఁడు వీరుఁడు సత్యవంతుఁ డే
భూముల దాగినన్ విడువఁబోవఁడు నిన్ను నృపాలకాధమా !

మహాత్మా ! నారదమునీంద్ర ! అరాతి వీర రక్తాస్వాదనంబునకు నా కరవాలంబు మిగుల వేగిరపడుచున్నయది. నే నింక రయంబుననరిగి, యా దురాత్ముని చిత్రకేతు హంతకుం బరిమార్చి వచ్చెద. ననుజ్ఞ దయసేయుఁడు.

నారద : కుమారా ! శాంతింపుము. నీ కిప్పుడు శత్రుమారణంబునకన్న—వృద్ధుఁడై—యంధుఁడై—దిక్కులేక మాయంబతోఁ గలసి యరణ్యంబుల నిన్నే తలంచుచు దుఃఖించు నీ తండ్రిగారి నోదార్చుట ప్రథమ కర్తవ్యము. కావునఁ దత్కార్యంబు తొలుత నాచరించి పిదప వలయునట్లు గావింపుము.

సత్య : దేవా ! నా తలిదండ్రు లేయడవింబడి దీనులై యున్నవారో నా కెఱుంగరాదయ్యెఁగదా !

నారద : తన్మార్గముం బ్రదర్శింప నే నున్నాఁడను—నా వెంట రమ్ము.

[ అందరు నిష్క్రమింతురు ]

—: o :—

# 2 వ రంగము

ప్రదేశము — అరణ్యము

[ అంధుడగు ద్యుమత్సేనుడు, కన్నులకు గుడ్డలు కట్టుకొని భవానియు — ప్రవేశము ]

ద్యుమ: —

ఉ. కన్నులు లేవు, భాగ్యము లఖండము నాశనమందె, శోకవా
రాన్నిధి మున్గియుంటిమి ; పరాక్రమవంతుఁడు సత్యవంతుఁ డే
తెన్నుల నున్నవాఁడో ? కడు దీనత నీవనమందు దిక్కు లే
కున్న యదృష్టహీనులకు నోరని దైవ మింకేమి వ్రాసెనో !

భవా: (శోకముతో) హా ! కుమారా ! సత్యవంత ! ఎక్కడ నున్నావురా తండ్రీ !—దిక్కులేక నీ నట్టడవిని పక్షులమై యల్లాడు మాగతి నీ కెఱిఁగించువా రెవ్వరు ? నాయనా ! నీవు తల కొఱివినిడ, నీ చేతుల మీఁదుగ మా మొండితనువులు వెడలి పోవునని నీపైఁ గొండంత ఆశ పెట్టుకొనియున్న మా ప్రాణములీ నట్టడవిం బోన నీ మునుసళ్ళ కగ్నిసంస్కారమైనం గలుగకుండ, నీ పాపపు శరీరంబులను గాకులు పొడుచుకొని తినుచుండ, శత్రువుల కన్నులు చల్లఁబడ నున్నవా ! మన వంశం బభివృద్ధమై—భూపారాన్వయంబుల నత్యంత సుప్రసిద్ధంబై—నెగడునని పల్కిన దైవజ్ఞుల పలుకు లెంతలో కల్లలయ్యెను ? హా ! జీవితేశ్వరా !—

చ. తనయుఁడు రాజ్యభారమును దాల్చి మిము న్సుఖపెట్ట విష్ణు పా
ద నళినసేవలం గడు ముదంబునఁ గాలముఁ బుచ్చనున్న మీ
ఘనతరజీవనం బిటులఁ గానలపాలయిపోవ, పాపపుం
గనులను జూచియున్ మృతిని గాంచక పోయిన నెంతపాపినో.

ద్యుమ: దేవీ ! అభాగ్యుండ నగు నావలన నశూర్యంపశ్యవైన నీవు సయిత మెట్టికష్టంబులు గలిగె—

సీ. కమనీయమణి డోలికాతలంబే ?
కలికి ! యీ పలుగు రాకటికి నేల
తులలేని మంగళతూర్యారవంబులే
కాంతరో ! యీ సింహగర్జనములు
సారంబులైన సుక్షీరోదనంబులే
లలితాంగి ! కందమూలములు నీకు
రమణీయమణి మందిరంబులే నీకు భీ
కర భూరుహాన్విత కాననములు

ఉవిద ! మోహనప్రదోద్యానవనములే
పరికపొదలబొదరు మొఱకుకాన
పడఁతి ! సుఖముఁ గనని వ్యర్థుడనైతి భ
వాని ! మధురవాణి !! పలితవేణి !!!

భవా: నాథా ! మహారాజ శతసహస్ర కిరీట మాణిక్య నీరాజిత—పాదకమలుండ వగు నీవే యిట్లు దురవస్థల పాలై పోవ నాఁడు దాననై —మీపాద దాసి నగు నా సుఖం బేపాటిది ?—హా ! విధీ ! పరమేశ్వరధ్యానంబుఁ దక్క నన్యం బెఱుంగని మహారాజు నిట్లు గావించిన నీ ధర్మపాలనంబు నేమందును ? దుర్మతి పక్షపాతివగు నిన్నుఁ దలంచి యూసించుటకన్న నజ్ఞాన కార్యం బింకొకటి లేదు. అకటకటా ! నేత్రంబుల బాధ తీవరింప, నాకలి దప్పుల నెఱుంగక, మహాభాగుండగు నీ మహా రాజు చాపచుట్టగఁ బడియున్న వాఁడు. ఓ యరణ్య క్రూరజంతు సంతానములారా ! మీరైన మమ్మొక్క కబళంబుగ నాహారించి మా యిడుమలం బాపరాదా ?—దురదృష్టవంతులు జీవితాశలేక ఘోరమృగంబుల కరాళంబులకు శిరం బందించి నను మరణంబు రాదుగదా ! ఏనాఁ డేపుణ్యాత్ములను మహాప చారంబు సల్పితిమో ఆ పాపం బిప్పు డనుభవింపక తీరునా ?—పాపీ చిరాయు వనుమాట బూటకం బగుటెట్లు ?

ద్యుమ: జీవితేశ్వరీ ! కుమారునకు మనమును మనకుఁ గుమారుఁడును నిఁక లేనటులేకదా !—హా ! మాలదైవమా ! మాసంసారంబు నిట్లు చెట్టునకొక పిట్టగాఁజేసి యలయించుచుంటివా ! పుత్రకా ! పుత్రకా ! రాజ్యభోగంబులు లేకున్న మానె—నీ సుందర ముఖ సందర్శనంబు గలుగకున్న మానె—ని మృదు శరీర సమాశ్లేషానందంబుననైన నీ మొండితనువు నిలుపఁ గలనను కొంటినిరా తండ్రీ !—నా దరికి రావేమిరా నాయనా !— నా దుస్థితులు నీ కెఱింగించువారెవ్వరు ? ఎంత దుర్గతి గల్గినను మన మూఁడు ప్రాణము లొక్కచోనున్న నానందమున నుందుము గదా !—తండ్రీ ! తండ్రీ !—నీ ఋణము దీరిపోయినదా !

భవా: నాథా ! ఏమి మీ వెఱ్ఱి ! ఆ చిత్రకేతు పాతకుఁ డింకను గుమారుని జీవములతో నుండనిచ్చుననియే తలంచుచుంటిరా ! శాత్రవశేషంబు దీర్పక వాఁ డూరకుండునా ? ఇంకెక్కడి కుమారుఁడు ? ఇఁకెక్కడి యాశలు !—

ద్యుమ: దేవీ ! నీవైన సంతోషమున నుండక నంధుఁడనైన నా వలెనే కన్నులకు చేలము బిగించి యంధగతిఁ గాలము గడుపనేల ? నీవైన నున్నంతలో సుఖముగ నుండుము.

భవా: నాథా ! మీ పాదదాసినగు నాకు మీకులేని సుఖము లెందులకు ? ఈ పాడుకన్నులతో మీ దుస్థితిం గనఁజాలను. నా మొండితనువు నిటుల వెడలిపోవనిండు.

[ నారదుడు, సుమాలి, సత్యవంతుడు — ప్రవేశము ]

సత్య : (తల్లిదండ్రులఁ గౌఁగలించుకొని) హా ! జననీ జనకులారా ! పుణ్యవంతులైన మి మ్మిట్టి గతిలోఁ జూడవలసి వచ్చినదా ! తండ్రీ ! తండ్రీ ! నీకు బలవన్మరణమే దాపురింప నున్నదా !

ద్యుమ: ఆ ! ఆ ! ఎవరు ? నా తండ్రియేనా ! నా తండ్రియేనా ! నా సత్యవంతుఁడేనా ! నా బహిఃప్రాణమేనా !—(కౌఁగలించు కొనును)

భవా: నాయనా! నా కన్నతండ్రీ! నా చిన్నారికూనా! వచ్చితివా! వచ్చితివా! నాయనా! ఈ పాపాత్ములకు నీ దర్శనం బగు ప్రాప్తము పోయినది. ఒక్కమాఱు మమ్ము బిగ్గర కౌగిలించుకొనుము బాబూ!—(కౌగిలించుకొనును)

సత్య: (శోకముతో) హా! హా! నా తండ్రిగారిని నే నెట్టిదుస్థితిం గనవయ్యెను? జనకా! పుత్రవత్సల! ఎంత నిట్టి ఘటనంబయ్యెను! ఆ పాపపు ప్రయాణము నా కేల సమకూరెను!—ఇంత దుర్గతి యగునను సూచనలు గల్గినప్పుడే నా కేల నెఱింగింపరై తిరి! కటకటా! తల్లీ! వీరపత్నివై—వీరమాతవైన నీ విప్పట్టున ననాథవై తివిగదా!—చెట్టంతకొడుకును బ్రదికియుండి మీకిట్టి పాపపుంగతిని గలిగించితిని! అక్కటా!—

గీ. నన్నుఁబోలిన యసమర్థుఁ గన్న మీకు
నిట్టిగతిగాక గలుగు నింకెట్టిశుభము
మీకుఁ జెట్టంతకొడుకనై లేకపోతి
ప్రాణముంగల శవమునై బ్రదికియుంటి.

భవా: నాయనా! నీవేమిచేయుదువు!—అదృష్టంబంతయు నిట్లున్నది. అప్పుడు నీవు పురంబుననే యుండిన మాకింత చేటేలమూడును?

ద్యుమ: నాయనా! చిత్రకేతుఁడు న న్నెంత పరాభవించెనో నోట వచింపలేను. నా ప్రాణ మెంత సంక్షోభించెనో దైవమెఱుంగు! ఇట్టి హీనంబగు పరిభవం బందియు బ్రదికియున్న నే మృతజీవుఁడ సుమా! నాయనా!

సత్య: (కోపముతో) తండ్రీ! చిత్రకేతు నామస్మరణమాత్రంబున నాయాగ్రహాగ్ని రవుల్కొని మండి ఆవేశం బొదవుచున్నది. సుమాలీ! నాధనుర్బాణంబుల నిటుదెమ్ము! నేనతిరయంబున నరిగి యా చండాని నామావశేషుం జేసి వచ్చెదను—.

ఉ. భండనసీమ కేగి కడు పాపచరి్తుని జిత్రకేతు ను
ద్దండతఁ దాఁకి, వాని నిజదారలు హోరని యేడ్చుచుండఁగా
గుండెలు పిండిజేసి, బుధకోటులు మేలనఁ దచ్ఛరీరముం
దుండెము లౌనటు ల్నఱికి తోరణము ప్రహాయింతుఁ గోటకున్.

నార : వత్సా ! సత్యవంతా ! ఏమి యీ యనాలోచితాందోళనము ! పడుచుదనంబున తొందరపడి కార్యహానిం గావించుటతప్ప ఫలంబేమియును లేదు. ఫలోన్ముఖమగు కాలంబు వచ్చుదనుక దైవానుగ్రహంబున కెదురుచూచుటయే మంచిది.

సత్య : మహాత్మా ! న న్నింకను వారించుచుంటిరా !—

సీ. హితదూరగతి వైరి మితిమీఱి క్షితినేల
గతిమాలి నెట్టి విఖ్యాతమయ్య
బలవంతముగఁ దండ్రి వలవంత నిడు వాంత
కుని నుపేక్షించుట ఘనమటయ్య
పెనుకాకల శలాకలను పీక దండ్రి క
న్నులుదీయ శమియింపఁగలనటయ్య
కడుదీనతను గాన నడలించి మము నొంచు
పరు నేచకుంట నా తరమటయ్య

భటుల సమయించి రిపు నొంచి వనటఁ బెంచి
సకలరాజ్యానుకూలంబు నంతరించి
పాపమతి చిత్రకేతుని వధముఁ గాంచి
తండ్రి ఋణమును దీర్తు నో తాపసేంద్ర.

నార : నీ ప్రయత్నము సమంజసమే—ఐనను సత్యవంతా ! నీ కిప్పు డీ యుద్యోగం బంత పోలియుండదు. ఏమంటివా !—

గీ. లెక్కకును లేఁడు సైనికుం డొక్కఁడైన
దుర్గమా పడె శాత్రవు దోర్యుగమున
నొక్కఁడవు నీవు పలువు రాయుధులు వారు
జయము దుస్సాధ్యమగుట నిశ్చయము గాదె.

సత్య : మహాత్మా! అట్లయిన మా బ్రదుకులవలన నేమిలాభము ?

నార : మీకు విజయకాలం బనతికాలంబున వచ్చును. అంతకాలము మీరు తాపసులై యుండక తప్పదు. ఉచ్చనీచగతులు ఘనులకుగాక నల్పులకు రావు.

ద్యుమ: నాయనా! కర్తవ్యబోధితులగు నా మహాత్ము లెవ్వరు ?

సత్య : మన దుర్గతిని నాకెఱింగించి నన్నిందుఁగొనివచ్చిన నారద మునీంద్రులు.

ద్యుమ: ఏమి మాభాగ్యము! నారద మునీంద్రా! అంధత్వంబున మిమ్ముఁగానక నపచారినైతిని. అబ్బాయియుఁ దెలుపఁడయ్యె. మహాత్మా! నీ పాదపద్మములకు నమస్కారము. మా కిప్పు డేదిదారి ?

నార : ద్యుమత్సేన రాజేంద్రా!—

ఆ. వె. బలియుఁడైన రిపుని పాపంబు పండు స
త్కాలమునకుఁ గొంత తాళవలయు
నసురవరులు రేఁగ నతిదైన్యమున మేరు
గిరుల దాగియుండు సురలవోలె.

మీకు నివాసయోగ్యంబగు సదాశ్రమంబును నేను చూపెదను రమ్ము.

[ అందరును నిష్క్రమింతురు ]

అవనిక జారును



# సంగీత సావిత్రి

## తృతీయాంకము

### 1 వ రంగము

ప్రదేశము — ఉద్యానవనము

[ సావిత్రి — ప్రవేశము ]

సావి : (తనలో) ఆహా ! సాయంకాల మెంత మనోహరముగా నున్నది—

ఉ. అంబరభద్రదంతి కసమాంధతయ న్మదధార లొప్ప భీ
మంబుగ లేచి భానుఁడను మావటివాని దివాంతశైలభా
గంబున జీల్చి రక్త మధికంబుగ నేలఁ దొరంగ జేసెనా
నంబరవీధి పశ్చిమమునందు రహించెడి సాంధ్యరాగముల్.

ఈ సాంధ్యరాగంబున కనురూప కషాయకాంతి సమంచితం బగు నీ వనాంతరము కంతుకేళీ గృహాంతరం బన నెంతయు భ్రాంతిఁ గొల్పుచున్నయది. నా చెలియగు సరస్వతి యింకను రాలేదు. ఫలకంబును దూలికయు వెంటఁ గొనివచ్చితిని. తరువాత వర్ణంబులను జిత్రింపవచ్చును. నాఁడు శార్దూల సంహార మైననాటనుండియు నా హృదయ మందరముననే బంధింపఁబడియున్న నా మానసచోరుని రూపపటంబు నీ విరిజాజిని కుంజము క్రిందనున్న, చంద్రకాంతోపలాసనముపైఁ గూరుచుండి యథేచ్ఛముగ లిఖించెదఁగాక ! (లిఖించుట నభినయించుచు) ఆహా ! ఏమి యీ చక్కదనము !—

సీ. జన్మమాదియుఁ గళంకము లేనివలరాజు
తెగి బూదిగాని రతీవిభుండు
అతివ కర్ధాంగ మీయని సర్వమంగళుఁ
డౌదలఁ దెగనట్టి యాదివేల్పు
తనువెల్లఁ గనులు జెందని దేవనాథుండు
చిలువపైఁ బడని లక్ష్మీవిభుండు
మృతులదారిని లేని శతమయూఖ విలాసుఁ
డనతీవిభుఁడు గాని యమరగురుఁడు

మాత లార్వురు లేని కుమారవరుఁడు
శీతలత్వ, మందంబు, విభూతి, నీతి,
వైభవము, సిరి, తేజ మపారవిద్యఁ
దనరి యీ రాట్కుమారుండు ధన్యుఁడయ్యె.

ఆ జగన్మోహనాంగునిఁ జూచిననాఁటఁగోలె నా మనంబు మనంబున నిలువదు. ప్రయత్నంబున నొకవేళ శాంతి దాల్తు మన్నను, దురాత్ములగు నీ చంద్ర మదన మలయానిలులు నన్ను బాధించుచున్నవారు. నే నేమిచేయుదును—ఓ చంద్రా! నీ వేమియుందగాఁడవని నీ కీ తొందరపాటు—

గీ. కళలు పదునొకం డురుశిరాగ్రముల నెక్క—
హరుల దరియఁగ నేగ, మ త్రైదుకళలు
మదనసాయకములఁ జేర తుదకు నీవు
కాంతిరహితశూన్యాకృతిఁ గాంతు గాదె.

ఓ మన్మథ ! నీవుమాత్ర మాఁడువారిపై బంటవు !—నిన్ను మజిల నొక్కమారా హరుఁడు మండించినను దోసము లేదు—

గీ. రూపమా లేదు ; నిశ్చలారూఢమైన
చాపమా లేదు ; బహుళశస్త్రాస్త్ర సుప్ర
తీపమా లేదు ; పాంథసంతాప నప్ర
తాపమా కాంచ నెంతయుఁ బాపమయ్యె.

అయ్యయ్యో ! ప్రొద్దు తెలియక నేను వెఱ్ఱియూహలలోఁ బడు చుంటిని. ఈ వెలుతురుండఁగనే మన్మనోహరుని రూపంబునకు వర్ణంబులను గైసేయవలయు. ఈ పటము నిందే యుంచి వర్ణములం గొనివచ్చెదఁ గాక.

[ నిష్క్రమించును ]

[ కొన్ని చిత్రపటములను చేబూని సరస్వతి — ప్రవేశము ]

సర : (తనలో) ఈ దినమున, నశ్వపతి మహారాజుగారు నన్నుఁ బిలిచి—“ సరస్వతీ ! భర్తృదారిక యగు సావిత్రికి వివాహ కాలము వచ్చినది. కావున నఖిల రాజన్యుల రూపపటంబులను వ్రాయించి తెప్పించితిని. అమ్మాయికి నీవు బహిఃప్రాణ మనందగిన నెచ్చెలివి. కావున, నామె యభిప్రాయం బేరాజ చంద్రునిపైఁ బ్రసరించునో యెఱింగి నా కెఱింగింపు ” మని యానతిచ్చిరి. పితృసమానులగు వారియానతి నిప్పుడే పాలించెదఁ గాక ! ఏదీ ! నా చెలి సావిత్రి !—ఇప్పు డిచ్చటికే వచ్చెనని గదా చెలులు పలికిరి !—ఈ విరిజాజిపొదక్రింద లేదే ? (తిన్నగఁ జూచి) ఓహో ! ఇం దేదియో చిత్రపటమును దూలికయు నున్నవి. (పరికించి) అయ్యారే ! ఎంతగడసరి యీ సావిత్రి !—ఈ మొగంబు తీరుచూడ, నానాఁడు పులిని జంపి మమ్ముఁ గాపాడిన వీరునిదిగఁ దోఁచుచున్నది. ఆతనిపై నీ బాల వలపు నిలిపినదా యేమి ? ఇంకను సందేహ మెందులకు— ఐనను, వీని నిజము నారయవలసినదే ! సావిత్రి రాకమున్నె పట్టంబునన్నున్న పురుషుని సమీపమున నీ సావిత్రి రూపంబును వ్రాసి దీనిం దాచి దాగియుండెద. అప్పు డన్నియు బయలు

పడఁగలవు. (అట్లు వ్రాసి పటము దీసికొనిపోయి చాటున దాగును)

[ రంగులతో సావిత్రి . – ప్రవేశము ]

**సావి :** మా సరస్వతి యిందు వచ్చినదఁట! ఏదీ! కాన్పింపదే! సరస్వతీ! సరస్వతీ!!—అన్నట్లు నా పటమేదీ!—ఇదే గైకొనిపోయియుండునా? విచారించెదను. సరస్వతీ! సరస్వతీ!!

**సర :** (మెల్లగా నడచును)

**సావి :** ఏమే? పెండ్లినడకలు నడిచెదవు?

**సర :** ఔనమ్మా! ఏమిచేయుదును! మా చెలికి పెండ్లి చేయఁబోవుచున్నారు. నడకలు నేర్చుకొనుచున్నాను.

**సావి :** ఛాలు నీ మాటలు!—నా పట మేది?

**సర :** చీరెయా! అవికయా!

**సావి :** పట మనిన వస్త్రము గాదు. నే నిచ్చట నొక పటమునుంచితి నది యేది?

**సర :** నీ కపటము నా కేమి తెలియును?

**సావి :** కపటముగాదే! ప్రాణము విసిగించక చెప్పు. చిత్రపట మేది?

**సర :** అయ్యో! అదటమ్మా! ఇదిగో నావద్దనే యున్నది. దానిపై నెవ్వరిరూపమును వ్రాసితివి?

**సావి :** నీ కద్దియంతయు నేల? పటము నిమ్ము.

**సర :** చెప్పినఁగాని నే నీయను.

**సావి :** మన్మథుని రూపమును వ్రాసితిని.

**సర :** ఔను, మన్మథునివంటి రూపమే. ఇదిగో నీ పటము. (ఇచ్చును)

**సావి :** (పరికించి) సరస్వతీ! ఏమీ యవినయము? ఈ చిత్రమునందు నా రూపము నేల వ్రాసితివి?

సర : తప్పేమున్నదమ్మా! నీవు మన్మథుని వ్రాసితివి! నేను రతీ దేవిని వ్రాసితిని—నీ రూప మెవ్వరు వ్రాసిరి?

సావి : ఎవరు నిన్ను వ్రాయుమని చెప్పినవారు?

సర : అట్టియాజ్ఞ కావలయునని నా కింతవఱకుఁ దెలియలేదు. ఇఁక జాగ్రత్తపడియెదను లెమ్ము.

సావి : మంచిదానవు—నేర్చుకొనుచుంటివి.

సర : ఔనుగాని—ప్రొద్దుపోయినది. ఇంటిలోనికిఁ బోవుదమా?

సావి : ఇంకను వెలుతురున్నది—నీ చేతులో నున్న వవియేమి?

సర : నీకొఱకు తెచ్చినదానిని నీవద్ద నెట్లు దాచుదును! కూర్చుండి మాటలాడుకొందము రమ్ము. (కూర్చుండి) చెలీ! సావిత్రీ! నీకు పరిణయకాలము సమీపించినదని, యెఱింగి తండ్రిగారు నీవు వరించుటకొఱకై—ఈ రాజకుమారపటంబుల పంపినారు. నీ యభిప్రాయ మెఱింగంతువేని, వారికి నివేదింతును.

సావి : ఈ పటములు నాకేల?

సర : మఱి యేపటము కావలయును?

సావి : నా హృదయపటమున నిదివఱకే నా మనోహరుని రూపము చిత్రింపఁబడియున్నది.

సర : సావిత్రీ! నా కెన్నఁడును నీ వీ విషయము నెఱింగింపవైతివి.

సావి : నెచ్చెలీ! నీవు గ్రహించితి వనుకొంటిని.

సర : నేను మందమతి నని యెఱుంగవా!

సావి : నీకు చెప్పెదనుగాని, నీ వెట్లు పరిహాసింతువో యని నా మది గొంకుచున్నది.

సర : చెలీ! నీకు హితముగావింప నానందమున నేవో తెలివి తక్కువమాటలాడుదాననేకాని—నిన్ను మనసార నెన్నఁడైన బరిహాసించితినా?

సావి : అట్లైన వినుము—

గీ. రమణి! వనమున నాఁడు వ్యాఘ్రమునుజంపి
మనలఁ గాచిన త్రైలోక్యమంగళాంగు
నవనవాకృతి నామది నాటిపోయె
నుర్వి నాతనిఁదక్క నన్యుల వరింప.

సర : సావిత్రీ ! నీ కిదేమి వెఱ్ఱి ! ఆతఁ డిప్పుడు మనకు లభించు టెట్లు ?

[ అనుబంధము 5 ]

సావి : దైవ విధానంబున నానాఁడు మన కెట్లు కాన్పించెనో యీ నాఁడును నట్లే కాన్పింపవచ్చును.

సర : కాన్పింపనిచో—

సావి : కాన్పింపనిచో నిట్లే శాశ్వతబ్రహ్మచారిణినై యుందును.

సర : ప్రకృతి విపరీతమైన తత్కార్యము పరిహాసాస్పద మేమో ?

సావి : ఎట్లగును ?—

గీ. ఒకని మనమునఁ గోరి వే ఱొకనిఁ జేరి
వ్యభిచరించుటకన్న నా యనఘురూప
మాత్మఁ దలఁచుచు బ్రహ్మచర్యవ్రతమున
మిగతకాలంబు బుచ్చుట మేలుగాదె.

సర : కానిమ్ము ; నీ సంకల్ప ముత్తమోత్తమ మైనదియే. కాని భగవత్కటాక్షము గలుగవలయును. పోని యిమ్మ పటములం జూడుము. ఆ పురుషుని రూపము గలదేమో.

సావి : ఇటు తెమ్మ. (అన్నిటిని దిరుగవేసి) ఇం దెందును లేదు,

సర : తండ్రిగారి కేమి చెప్పుదును ?

సావి : నా యభిప్రాయము నెఱింగింపుము.

సర : సరే—అట్లే చేసెదను.

సావి : చెలీ ! అప్పుడే ప్రొద్దు పోయినది. చూడు చంద్రబింబ ముద యించుచున్నది—

సీ. చటులాంధకార వృక్షచ్ఛేద మొనరింప
దగుకాలదంతి దంతంబు లనఁగ
చదలేటి తూరుపు చక్కిఁ గట్టుననున్న
ప్రియమూరు చెంగల్వ రేకు లనఁగ
ప్రాగ్పతిపురిలోంట రహిమించు నందంపు
చల్లనిగందంపుచార లనఁగ
పల్లవాస్త్రుని కోటవాఁకిటి భటుల హ
స్తంబుల వెండిబెత్తంబు లనఁగ

కలువలకు వెన్నెల నీటికాలువలను
దోహదము సేయు పటికంపుదోను లనఁగ
గగనభాగంబునను శీతకరుని కిరణ
జాలములు కొన్ని వ్యాపించె సాంద్రముగను.

ఇంక మనము పోవుదము రమ్మ.

[ నిష్క్రమింతురు ]

—:०:—

## 2 వ రంగము

ప్రదేశము — ఉద్యానవనము

[ మునివేషముతో పరశువుఁదాల్చి సత్యవంతుడు — ప్రవేశము ]

సత్య : (తనలో) కటకటా ! మానవంతునకుఁ బరాభవదుఃఖమునకన్న నధిక మగునంత లేదుగదా !—

[ అనుబంధము 1 ]

సీ. గిరిరాజ దుర్మదోద్ధుర నివారకమైన
దంభోళిఘాతలఁ దగులవచ్చు
అఖిలదిక్కులను బంచాగ్ను లుద్భవమంది
తనువు గాల్చిన నైన తాళవచ్చు
క్షుద్బాధితానేక కుంభద్భుజంగ వి
షజ్వాలలను గొంత సైపవచ్చు
నిర్ఘోషకాదంబినీజాతమైన వి
ర్ఘాతపాతమునైనఁ గాంచవచ్చుఁ

గాక సైరింపవచ్చునే భీకరారి
కృత దురంతార్తి దాయకానీతియుక్త
భయద మరణాధికంబైన పరిభవంబు
వసుధలోపల నభిమానవంతునకును.

దుర్మద శాత్రవకృత పరిభావంబుఁ దీర్పఁ మార్గాంతరంబు లేమింజేసి, మన్మానసంబు మఱింత యుడుకుచున్నది. శత్రు సంహారంబునకుఁ బనికిరాని క్షత్రియుని బాహుబలంబు పొలము కాపునకై నియోగింపఁబడిన గడ్డిబొమ్మ రూపంబువంటిది—

ఉ. క్షత్రియ వంశమం దసమజాతముగాంచి ధనుష్కళావిధి
స్తోత్రముగాంచి శత్రువుల దోర్బలవీల నణంపఁజాలి లో
కత్రయ వీరులం గెడపఁ గల్గిన శౌర్యము దాల్చి పోరికిం
బాత్రముగాని రాసుతు నపారబలం బదియేల కాల్పనే ?

క్షత్రియకుమారా నర్థంబుగ శాంతవృత్తిందాల్చి యెన్నినా
ళ్ళూరకుండఁగలను ?—

గీ. సూర్యకాంతంబుచేత నశూన్యమయ్యు
చండతర పాదహతి రేగి మండుచుండ
క్షత్రియాన్వయమందున జన్మమంది
తగునె వ్యర్థుండనౌట చేతనుఁడనయ్యు ?

ఇంక శాంతింపఁ జాలను. దుష్ట పరిపంథికులాంతంబు గావించి నేఁడే మత్పితృ పరాభవ దుఃఖం బామూలంబుగఁ దీర్చెద. ఓరోరీ ! దురాత్మా ! చిత్రకేతుహంతకా ! ఇన్నిదినంబు లీశ్వరుని కృపచేతనో, తత్పూర్వపుణ్య లేశంబుననో జీవంబులు నిలువం గలిగెనుగాని, నేఁటితో నీ ధూాయుర్దాయంబు పూర్ణంబుగఁ దీరిపోయె—

చ. శునకముపోలె మాపురముఁజొచ్చి పవిత్రుఁడు వృద్ధుఁడైన నా
జనకుని కన్నులం బొడిచి శాత్రవముం బొడిగించినాఁడవే
తనయుని సత్యవంతుని మదం బొదవన్ మఱిపొందినాఁడవా
చెనఁటి భవచ్ఛరీరమును జీల్చి యొనర్చెద భూతపర్వమున్.

(ఆలోచించి) దేశకాల పాత్రంబుల నాలోచించికదా ప్రాజ్ఞులు కర్మంబు లాచరింపఁ దగును ; రిపు లొనరించిన మహావమాన దురంతాచరణంబున నిలువెల్ల భగ్గునమండ వివేకముచెడి, యీా నుడు లాడుచుంటినేకాని, యిది యెంతైన తొందరఁ జెందఁ దగిన సమయమా ?—

సీ. బహుళ చమూయుక్త పరిపంథివీరుల
భటు డేనిలేక చంపంగ నగునె ?
శస్త్రాస్త్రకోటిఁ బ్రశస్తులౌ రిపుల నొ
క్కఁడుగు చేతనులేక గెలువ నగునె ?
గజహయస్యందనక్రము లగువారి న
శ్వం బొక్కఁటియులేక చంప నగునె ?
శూరదుర్భేద్య కంచుకధారులౌ వారి
నీ కావిగుడ్డతో నెదుర నగునె ?

భీషణాభీల బహుభటాభేద్యసమర
సాధనాంచితవిస్తార శరసమేత
సింహగంభీర నిర్ఘోష సింధుభీష
ణారిబలమేడ ? నాదు శౌర్యంబదేడ ?

ఏమి నా వెఱ్ఱి ? ముని వరప్రసాదలబ్ధంబులగు బహుళాస్త్ర మంత్రంబులు నా కరగతంబులై యుండ, బాహుబలాధా రంబునఁ బ్రధనం బొనరింపనెంచు నాయరాతుల నొంచుట నా కెంతపాటి కార్యము ! తల్లిదండ్రుల యాజ్ఞఁగొని నేఁడే చని, మంత్రజలపూరిత తృణసంధానమాత్రంబున శాత్రవుల నిర్వీర్యులం జేయఁజాలు బ్రహ్మశిరోనామకాది శస్త్రరాజం బులఁ బ్రయోగించి రిపుల గగ్గోలుగావించి యత్రశమంబున రాజ్యంబును స్వాధీనంబు గావించుకొందునా? (కొంతదూరము నడచి యాలోచించి) ఇది యెంతమాత్రమును గూడనిపని. ఇందులకు నా జననీజనకులదే పెద్ద యవరోధ మగుంగదా ! నిజయశః కారణంబులై—నీతిప్రదంబులగు సకలకళాదుల నలవరించుకొనుటకును, భవబంధ విచ్ఛేదనాతీత సామర్థ్యంబు నకును, పాపనాశన దుర్గమ స్వర్గలోక బంధీకృత కవాట విపాటన పాటవంబైన సత్కార్మానుష్ఠానంబునకును, సర్వజన

స్తవనీయ పరోపకార కారణాధ్యాత్మ నైర్మల్యంబునకును, చతుర్విధ పురుషార్థ సంపాదనంబునకును, పరమపురుష భజనానంద సంధానంబునకుఁ గారణంబైన యీ భౌతిక దేహంబు మానవులకుం గలుగుటకు జననీజనకులేకదా కారణభూతులు. అట్టి తల్లిదండ్రులను బూజించుటయే—యీ శరీరధారికిఁ బరమోత్కృష్టంబగు ధర్మము. గర్భంబున ధరించి నవమాసంబులు మోసి కని పెంచి పెద్దవానింజేసిన తల్లిదండ్రులకన్నఁ బరదైవంబులు మానవులకు లేరుగదా! పూర్వార్జితంబై శాత్రవులచే నష్టంబైన రాజ్యంబును గైకొనుటకన్నఁ బితృపూజనమే యత్యంత సుకృతంబు. ఉదయంబాది నన్ను విడువనేరక, నిరంతరము "కొడుకా — కొడుకా" యని పలువరించుచు, నన్నరనిముసంబైనఁ బాయనేరకున్న పుత్రప్రాణైక జీవనుల నా తల్లిదండ్రుల నెట్లు విడిచి పగతురసడంప నరుగువాఁడ! నా తల్లిదండ్రులకుఁ గందమూల జలాహారాదు లనుదినంబు సమకూర్చువా రెవ్వరు?—ఎటులైన దైవమే కాలానుకూలంబుఁ గావింపవలయును. మానవ ప్రయత్నంబులు కేవల నిరర్థకంబులు. (ఆలోచించి) ఏది యెటులున్నను, చిత్రకేతుఁడే నాకన్న ధన్యతముఁడని తోఁచుచున్నది. ఏమనిన—

ఆ. వె. అతఁడు నాధుజనకు వెతముంచి తనతండ్రి
బుణముఁ దీర్చుకొనియె రణమునందు
కాని, నాదుజనకుఁ గన్నుగుడ్లు దీసిన
కలుషకర్ము వధముఁ గాంచనైతి.

[ తెరలో ]

సఖీ!—సావిత్రీ!—ఇటు ఇటు.

సత్య : (విని) ఏమిది !—ఈ నామాక్షరంబు లిట్టి కంఠస్వరముననే తొల్లి నాశ్రవణరంధ్రంబులం బావనం బొనరించినవి !— పూర్ణంబుగ స్మృతిగల్గుట లేదయ్యె !—ఎవరై యుందురు ?

[ సరస్వతి, సావిత్రి — ప్రవేశము ]

[ అనుబంధము 2 ]

సర : సఖి ! సావిత్రీ ! ఇటు ఇటు—నూతనముగా నిర్మింపఁబడిన ఈ యుద్యానపథంబు నీ కగోచరమైనది. జాగరూకతగ నడచి రమ్మా.

సావి : సరస్వతీ ! నే డీవనంబునకుఁ గ్రొత్తశోభవచ్చినట్లున్నదే !

సర : వనలక్ష్మికి వసంతాగమనము శోభాకారణముగాదే ! సావిత్రీ ! అది సహజమే కాని నీమొగం బేలనో నేఁడు వింతకాంతిఁ దాల్చినది !

సావి : చాలు—నీ సంభాషణముల కొకనీతి యున్నదా ?

సత్య : (తనలో స్మృతినభినయించి) ఆ ! ఇప్పటికి స్మృతిగల్గినది ! ఆనాఁడు వ్యాఘ్రముచే బాధనందు వీరిని నేను గాపాడిన వృత్తాంతంబు నా కెంతలో మరపునకువచ్చెను. దుఃఖములచేఁ గ్రుంగిపోయిన నామదికి మఱపుగాకేమున్నది ? ఈ మెఱుంగుఁ బోడి యాకృతి నా కప్పుడప్పుడు కన్నులలోఁ దళుక్కని మెఱసిపోవుచుండును. అప్పటి యాకృతికి నిప్పటి యాకృతికి నెంతభేదముగలదు ! నవనవాంగకింబులు యౌవనప్రాదుర్భావమున మిసమిసలాడుచు, పరువంబున నిండి, యువకుల గుండియ లవియఁజేయు చెఱుకు విల్తుని కఱకుటమ్ములవలె నిరవొందుచున్నయది ! ఈలోన నీమెకుఁ గల్యాణ మయ్యెనో లేదో ?

సావి : సరస్వతీ ! భానుఁడు పడమటికిఁ దిరిగినందున నావంక నీరెండ గాయుచున్నది. మన మిందుఁ గూర్చుండము రమ్మా. (కూర్చుండును)

సత్య : (తనలో)—

గీ. వలువచెంగావి మింటికి వన్నెవెట్టఁ
గనులరాగంబు లేజివుళ్ళను హసింప
వింతహొయలున వనరమాకాంతవోలెఁ
గూరుచున్నది సుమలతాకుంజమందు.

[ అనుబంధము 3 ]

సావి : సరస్వతీ ! తండ్రిగారు నాపరిణయంబున కింతతొందరపడుటేల?

సత్య : (తనలో) ఇప్పటి కింకను గన్యయని తెలిసినది. నా యాశాంకురము నిలుచునో భగ్నమగునో—(తన్నుఁ జూచుకొని) ఆహా! మానవుని యాశాప్రవాహ మనంతమైనదిగదా ! ఈ ఆకృతికి—ఈ వైభవంబునకు—నీ జగదేకసుందరి నాకాంక్షించుచుంటినా! ఎంత బుద్ధిమాంద్యము ?—

సీ. రాజేంద్రతనయ యీ రాజేందుముఖియేడ ?
విపినరాజ్యంబు నా విభవమేడ ?
కాంచనాంబర వస్తు సంచయంబులవేడ ?
నీకాషాయాంబరానీకమేడ ?
దాసదాసీజన వ్యాసంగ మదియేడ ?
నవ్యైంధ నాన్వేషణంబదేడ ?
భావిత సౌధాంతరావాసమదియేడ ?
పరుషమహా నీవనవాసమేడ ?

పుణ్యభావనమతి జగన్మోహనాంగి
విమలశుభశీలయైన సావిత్రియేడ ?
విగత వైభవాభాగ్య ప్రవిష్టుఁడైన
సత్యవంతున కుద్వాహ సరణియేడ ?

స్వాంతమా ! నీ భ్రాంతి నింతటితో మానుము.

సర : సఖీ! సావిత్రీ! మన విద్యాభిలాష నెఱింగియే తండ్రిగారు కల్యాణముం గొన్నిదినములు నిలిపియుంచిరి. కన్న తలిదండ్రు లల్లారుముద్దుగఁ దమ కనులయెదుటఁ దనయలకుఁ బరిణయంబు సలుప నభిలషించుట సహజముగదా!

సావి : నా యభిలాషంబును నీవు తండ్రిగారి కెఱింగించితివా?

సర : ఎఱిఁగించితిని; కాని వారిమతం బన్యథా ప్రవర్తిల్లుచున్నయది!

సావి : ఎట్లు?

సర : నామాటవిని తండ్రిగారు నన్నుఁజూచి "సరస్వతీ! అమ్మాయి కిది మాధ్యముగా నున్నదిసుమా! ఊరుపేరులేని యొక్కనిం గోరి పలువరించుట పరిహాసాస్పదమనియు, ననురూప రాజ కుమారు కరగ్రహణంబు సల్పి మామదుల కానందముం గూర్చి సుఖింపుమనియుఁ జెప్పు" మనిరి.

సత్య : (తనలో) ఊరుపేరులేనివాఁడని యీ సావిత్రిజనకుఁ డధిక్షే పించిన యా ధన్యాత్ముఁ డెవ్వఁడో కదా!

సావి : సఖీ! తండ్రిగారిమాటవలన నీ కేమి తోఁచుచున్నది?

సర : అమ్మా! నీ మనంబునకు వ్యతిరేకంబుగ నే నేమిచెప్పఁగలను?

సావి : నా హితాభిలాషిణివగు నీకన్న వ్యతిరేకంబుగాని, యను కూలంబుగాని చెప్పుట కెవ్వరున్నారు?

సర : అట్లయిన నీ వలుగవేని చెప్పఁదలంచితిని.

సావి : చెప్పుము. నీ యందు నా కలుకేల?

సర : అమ్మా! కులశీలాదు లెఱుఁగని పాంథుఁ డాతఁడు! పడుచు దనంబున నీ మనం బా రాసుతునిపైఁ బరువెత్తినంతమాత్ర మున నింతగా వానిం జేపట్టుదునని సాహసింపవచ్చునా? ఇది నీకులంబున కెంతయమర్యాద. అదిగాక, నాడెప్పుడో లేటి త్యాంతివలె మనకంటఁ బడుటయేకాని నాటికి నేటికా

సావి : —గీ. ఘోర వృకరాజమును భువిఁ గూలనేసి
కాచిన ఘనుండు వీరుఁడు గాకయున్నె ?

సత్య : (ఆనందముతోఁ దనలో) ఆహా ! ఏమి నా భాగ్యము ! ఈ యభాగ్య సత్యవంతునకే యంతటి యదృష్టము చేగూరినదా ! ఆహాహా ! ఆనందాతిరేకమున నా శరీరము పరవశంబగుచున్నది—

సీ. నేఁడుగా సాళ్వావనీనాథ విస్తార
వంశంబు పరమపావనతఁగాంచె
నేఁడుగా మత్పురాకృత భూరి జపతప
ప్రాగల్భ్యమెల్ల సత్ఫలముఁగాంచె
నేఁడుగా నాతండ్రి నిజమైనసత్పుత్ర
వంతుఁడై బుధులందు వాసిగాంచె
నేఁడుగా దౌర్భాగ్యుని యతి నధోగతిఁ
జరియించు నాజన్మ సఫలమయ్యె

నేఁడుగా నాదుపితరు లనేకవర్ష
పుణ్యలోకాప్తి గనునాశ వొడమెనింక
నీ సతీమణి గుణమణి భాసమాస
గురుభుజగవేణి సన్నృప నరయుచుంట.

కాని యీ దరిద్రు నేల నా భాగ్యవతి వరించును ?

సావి : అదిగాక—ఆతం డెక్కడనుండెనో—విభవోపేతుం డగునో కాఁడో యని నీవు సంశయించెదవన్న నిటు వినుము—

ఆ. వె. భవన మొక్కటైన నివసింపఁగాలేక
కట్టగుడ్డలేక గట్టుపైని
పాములను ధరించి భస్మంబు నలఁదెడు
శివుని గౌరి సేవ జేయకున్నె ?

స్వరూపంబునే మరలఁ గనులఁ గాంచమైతిమి ! అతఁడెవ్వఁడో? ఏ దేశమువాఁడో ? ఎందుండి యెందుఁజనువాఁడో ? కల్యాణ మయ్యెనో లేదో ? నీపై నాతని కనురాగంబుగలదో లేదో ? యేమియు నెఱుంగక నీ వీ ఆకాశసౌధంబులల్లుట నాయుల్లంబు నకు సరిపడని విషయము. తల్లీ ! నీ తలిదండ్రుల మతమునం జని, సకలరాజకుమారికా వర్గంబెట్టులో నీవును నటులే—సం స్తవనీయచరిత్రవై కాలంబు గడుపుదువేని మే మందఱ మానందింతుము.

సావి : (నవ్వి) ఓసి యున్మత్తురాలా ! చిరసహవాసంబున సయితము మండూకమునకుఁ గమలసౌరభం బెఱుంగరానిచందంబున నీకు నా హృదయ తత్త్వంబు బోధపడదయ్యె. మనస్సునం గోరిన వానింగాక వేఱొకనితోడ శరీరసుఖంబుల ననుభవించుట వ్యభిచరించుటయే కాదే !—నా మనంబునఁ గోరినవాఁ డెట్టి వాఁడైన నా కాతఁడే జీవనజీవనము. అతఁడుదక్క యన్యుల వరియింపను. ఇది నిర్ధారణము. నీవుగాని, తండ్రిగారుగాని, యీ విషయంబున నా కెంతబోధించినను లాభ మింతైనఁ గలుగదు. అదిగాక—

గీ. సరసమూరి సహస్రతేజః ప్రభాసుఁ
డతఁడు హీనకులోత్పన్నుఁ డగునె మగువ !

సత్య : (తనలో) అంతటి సుందరాంగుఁడై—ఈ మందయాన ప్రేమం బున కాస్పదంబగువాఁడు నిక్కముగ సత్కులాలంకారుఁడే యగును. ఈమె నాపై నానాఁడు ప్రేమవీక్షణంబులఁ బరపినది. ఇప్పుడు మనంబునఁ గోరినవారినిగాక వేఱొకనిం బరిణయమాడ నని పల్కుచున్నది. ఈ సందర్భమును నే నేమిగాఁ దలంపను ? (ఆలోచించి) డెందమా ! నీ కెందుల కీయాశ—దైవోప హతుండనగు నా కంత సౌభాగ్యమా ?

సావి : —గీ. ఘోర వృకరాజమును భువిఁ గూలనేసి
కాచిన ఘనుండు వీరుఁడు గాకయున్నె ?

సత్య : (ఆనందముతోఁ దనలో) ఆహా ! ఏమి నా భాగ్యము ! ఈ యభాగ్య సత్యవంతునకే యంతటి యదృష్టము చేగూరినదా ! ఆహాహా ! ఆనందాతిరేకమున నా శరీరము పరవశంబగుచున్నది—

సీ. నేఁడుగా సాళ్వావనీనాథ విస్తార
వంశంబు పరమపావనతఁగాంచె
నేఁడుగా మత్పురాకృత భూరి జపతప
ప్రాగల్భ్యమెల్ల సత్ఫలముఁగాంచె
నేఁడుగా నాతండ్రి నిజమైనసత్పుత్ర
వంతుఁడై బుధులందు వాసిగాంచె
నేఁడుగా దౌర్భాగ్యుని యతి సధోగతిఁ
జరియించు నాజన్మ సఫలమయ్యె

నేఁడుగా నాదుపితరు లనేకవర్ష
పుణ్యలోకాప్తి గనునాశ వొడమెనింక
నీ సతీమణి గుణమణి భాసమాస
గురుభుజగవేణి సన్నృప నరయుచుంట.

కాని యీ దరిద్రుడు నేల నా భాగ్యవతి వరించును ?

సావి : అదిగాక—ఆతం డెక్కడనుండెనో—విభవోపేతుం డగునో కాఁడో యని నీవు సంశయించెదవన్న నిటు వినుము—

ఆ. వె. భవన మొక్కటైన నివసింపఁగాలేక
కట్టగుడ్డలేక గట్టుపైని
పాములను ధరించి భస్మంబు నలదెడు
శివుని గౌరి సేవ జేయకున్నె ?

అతం డెంత దీనదరిద్రదశలనున్న మనసార నాపతిగ వరింతును.
ఎక్కడివాఁడో యంటివా——తండ్రిగారు తలంచుకొనిన నాతని
బృహద్భూభమండలంబుల నెందైన నరయఁగలరు.

సత్య : (తనలో) ఇప్పటికి నా శంకాలేశము సయితము వదలిపోయినది.
భళీ ! సావిత్రీ ! సావిత్రీదేవియే నీకు సాటి——

ఆ. వె. మందయాన లవని నెందైన భాగ్యభో
గ్యాదులందు నాస నందుచుండ్రు
పేదయైన నొక్క విభుని కాంక్షించిన
కాంత నీ జగానఁ గాన నేను.

సావి : సరస్వతీ ! ఈ ప్రొద్దుబోని మాటలతో నేమిగాని——నీ కదను
గలిగినపుడు తండ్రిగారితో నా మదిఁగల కుతూహాలం బెఱిం
గించి నేను వ్రాసిన చిత్రపటముఁ జూపి యట్టివాని నన్వేషింపు
మని చెప్పుము. ఇంక మనము పుష్పాపచయము గావించి
యింటికిఁ బోవుదము రమ్ము.

సర : నీ యిష్ట మటు లున్నపుడు నే నేమిచేయుదును ? సత్వరంబున
నీ కల్యాణముం గాంచ నభిలషించిన మా కోరికలు దూరము
పోవుచున్నవి.

సావి : సఖీ ! ఇచ్చట గుత్తముగానున్న ముండ్లమొత్తంబులం
దెంతయు విరివిగా వికసించిన జపాపుష్పంబులు గలవు. సంగ్ర
హింతము రమ్ము.

సర : కొంచెము శ్రమపడినగాని కోయలేమని తోఁచుచున్నది. పొద
యంతయు ముండ్లచే నిండివున్నది. కొంచెము జాగరూకతతోఁ
గోయుము.

సత్య : (తనలో) వా రీవంకకే వచ్చుచున్నట్లున్నది. ఈ మందయాన
నన్నీస్థితియందుఁ గాంచిన నెంత రోతపడునోకదా ?

సీ. కనక దుకూలముల్ గాంచిన కన్నులీ
కావిగుడ్డల కెంత యేవపడునొ ?
కరమున శాతాసిఁ గాంచిన కన్నులీ
పరశువు గని యెంత విరసమౌనొ ?
జననాథ తనయాకృతిని గన్న కన్నులీ
దృశరూపుఁ గని యెంత విసువుకొనునొ ?
ఐశ్వర్యసంశోభ నరసిన కన్నులీ ద
రిద్రాకృతికి నసంప్రీతి గనునొ ?

పలుకు లెన్నైనఁ బలుకంగవచ్చుఁగాని
హృదికి నింపైన యాకృతియేని లేని
పరమనిరుపేదవానిని వలచి కొలువ
చంచలులు మించుఁబోడులు సాధ్యమగునే ?

సావి : సరస్వతీ ! సరస్వతీ ! ! ఈ జపాకంటకములు నా చీరె చెఱంగును బట్టుకొని శాఖతోఁగూడ పై కెగసిపోయినవి. ఏదిదారి ?

సర : సఖీ !—అయ్యయ్యో ! ఎటులమ్మా ? నేనుసయితము దాని నందుకొనలేను.

సావి : అయ్యో ! ప్రయత్నించియైనఁ జూడవే !

సర : (ప్రయత్నించి) అయ్యో ! అంతయుఁ గంటకమయము— సాధ్యముగాదమ్మా ! ఏమిచేయుదుము ?

సత్య : (తనలో) నే నీమెకంటఁ బడుట కీ కంటకంబు లొకమార్గముం జూపినవి. కాని శీలభంగ మని ఈ బాల కలత నందునేమో ?

సర : ఆజానుబాహు లెవరికైన నందవలసినదే కాని యాఁడువార మగు మన కది యందదుగదా ! పొడగరి యగు మన సరో జాక్షినిఁ బిలుచుకొనివత్తునా ?

సావి : న న్నొంటరిగ నిం దెట్లు విడిచి పొమ్మెదవే ?

సత్య : (తనలో) ఇఁక సంకోచింపఁ బనిలేదు. (ప్రవేశించి) కాంతలారా! మీ రాందోళన పడనలదు. దీర్ఘము లగు నా బాహువుల కీ కొమ్మ చక్కగా నందఁగలదు. (చేలకుము దీయుచున్నాఁడు)

సావి : (రహస్యముగా) సరస్వతీ! ఈ మహాత్ముని మును నెన్నఁడో చూచినట్లున్నది. (ప్రకాశముగా) అయ్యా! ఆనాఁడు శార్దూల మును—(సగము చెప్పి సిగ్గుపడును)

సత్య : ఔను. నే నానాఁడు శార్దూలముం జంపి మిమ్ము రక్షించిన వాఁడనే.

సావి : (తనలో) భగవంతుఁ డెంత కృపాపరిపూర్ణుఁడు. నా ఆశయము నెఱవేరఁగలదు. కటకటా! ఎంతలో నెంత వ్యత్యాస మయ్యెను. నిరంతరాత్మ న్మనోగోచరంబే యైనను, ఈ మూర్తి యవస్థాభేదంబున వెంటనే గురుతింపఁ బోలదయ్యెను—

ఆ. వె. తరణి కిరణదీప్తి ధగధగలాడెడు
కవచ మేగి కలిగె కావిగుడ్డ
శత్రు వీరగర్వ శతధా విదారణ
భయద ఖడ్గమేగి పరశు వమరె.

మణిని మసిపాతం గట్టిన విధి కెంత బుద్ధిమాంద్యము!

సర : (ఆనందముతో) చెలీ! నీ భాగ్యరేఖ పండినది.

సావి : (తనలో) లజ్జావశమున నే నిందు నిలువలేకున్నాను. (ప్రకాశముగ) సరస్వతీ! ప్రొద్దుబోవుచున్నది. రమ్మింటికిఁ బోవుదము.

సర : ఓ కృతఘ్నురాలా! రెండుమారు లుపకారంబుసల్పి ప్రాణ రక్షణం బాచరించిన మహాపురుషునకుఁ బ్రాణమైన సమర్పింపఁ దగినదే కదా! కృతజ్ఞతా పూర్వకంబుగ నమస్కరింపనైన నమస్కరింపక వెడలిపోఁ జూచుచుంటి విదియేమి? (చెఱగు పట్టుకొనును)

సావి : నీవు నాకు మారుగ వందనము లర్పింపుము.

సర : నే నేల నర్పింపవలయు—నిలువుము.

సావి : నా చెర గేల పట్టుకొనెదవు. వదలుము. (చేలాంచలము లాగు కొనఁగా పూవులు క్రిందఁబడును) అయ్యయ్యో ! ఇప్పుడు నా యొడిలోని పూవులన్నియుఁ గ్రిందఁ బోయినవి. ఓ యవి ధేయురాలా ! ఏమిది !

సత్య : కల్యాణీ ! సరస్వతి యవిధేయురా లగుట నన్ను నీకు విధే యునిఁ జేయుటకే—ఈ పుష్పంబుల నేరి నేను నీ కర్పింతును. (పూవులనేరి దోసిటఁ బోయును)

సర : "తదేవ లగ్నం సుదినం తదేవ తారాబలం చంద్రబలం తదేవ"

సావి : ఓ కుటిలురాలా ! పరపురుషులయెదుటనా నీ యత్యాచారము !

సర : క్షమింపుము. పరపురుషు లనుకొనలేదు.

సావి : చాలు—నీవు వెనుకరమ్ము. నేను పోవుచున్నాను.

[ సత్యవంతుని జూచుచు చిరునవ్వునవ్వుచు నిష్క్రమించును ]

సర : మహాపురుష ! మా చెలి ప్రణయకోపి. దానిమాటల నన్యథా భావింపకుఁడు. మీ యుపకారంబుల ఋణంబులు శీఘ్ర కాలమునఁ దీర్పఁబడును. మఱియొక కల్యాణకాలంబునఁ దమ బునర్దర్శనంబు కాఁగలదు. [ నిష్క్రమించును ]

సత్య : ఆహా ! ఏమి యీ వయ్యారి యొయ్యారము !—

గీ. బొమలు ముడివడలేదు ; బింబోష్ఠి మృదుక
పోలములు కందలేదు ; సంచాలనమున
హృదయ మదరగలేదుగా సుదతి ప్రణయ
కోపమున విలాసంబునే చూపెఁగాని.

పాదములు—కదలనీయకున్నవి—భావిసంఘటనము పరమేశ్వరు నందే యుంచెదను.

[ అనుబంధము 4 ]

[ నిష్క్రమించును ]

అవనిక జారును



# సంగీత సావిత్రి

## చతుర్థాంకము

### 1 వ రంగము

ప్రదేశము — రాజమందిరము

[ అశ్వపతి, నారదుడు, మాళవి, సరస్వతి, సావిత్రి — ప్రవేశము ]

సావి : జనకా !—

చ. మనకులమందులేని యవమానకరంబగు మారుపెండ్లి మీ
మనమున నెంతురేమిటికి మానవతీమణులైన కన్యకల్
మనమునఁగోరి యొక్కని సమానుషభంగినిగోరి యొక్కనిన్
ఘనతర శీలసంపదకుఁ గానికళంకముఁ బూను టొప్పునే ?

అశ్వ : నారదమునీంద్రా ! వింటిరిగదా ! ఎన్నిసారులు బోధించిన నిదియే పాఠ మప్పగించుచున్నది.

నార : అశ్వపతి రాజేంద్రా ! అట్టి దృఢనిశ్చయంబుగల కన్యాలలామంబు నన్యథా ప్రవర్తింపనిచ్చుట మనకును శ్రేయంబుగాదు. ఐన నా రాసుతుం డెవ్వఁడో తెలిసిన నతఁ డెట్టివాఁడో చెప్పవచ్చును.

అశ్వ : అమ్మాయీ ! నీ వాతని రూపంబును రచించితివని సరస్వతి చెప్పినది. మునీంద్రుల కా పటము నిమ్ము.

సర : (రహస్యముగా) చెలీ ! నీవు రచించిన యా మహాపురుషుని రూపంబు ప్రక్కనే నేను నీ చిత్రమును లిఖించితినిగదా ! దానిం దెచ్చి తండ్రిగారి కీయనా ?

సావి : (రహస్యముగా) మంచిపనిచేసెదవు శే! నన్ను పరిహాసింపఁజేయుటయూ నీసంకల్పము. అది వలదు. మొన్న మనకు వనంబునఁ గాన్పించినరీతిఁ గాషాయాంబరధారియై పరశువుం దాల్చియున్న రూపంబు నొండు లిఖించితినిగదా! దానిం దెచ్చి యిమ్ము.

[ సరస్వతి నిష్క్రమించి పటముదెచ్చి అశ్వపతి కిచ్చును ]

అశ్వ : (చూచి) మునీంద్రా! ఈ రూప మెంతయు స్తుతిపాత్రమై యున్న దిసుఁడీ! మహాతేజస్వి యగు నీ పురుషవరేణ్యుఁడు కంతు జయంతాదులను మీఱియున్నవాఁడు—కాని ఈ రూపమేమి?—

సీ. దేదీప్యమానమై దీపించు నీ మేను
మురికిజేగురుచేలములకుఁ దగునె?
పటు బలస్ఫూర్తి నొప్పారు నీ భుజములు
కట్టడి పరశువుఁ బట్టఁదగునె?
సుకుమారమై మారసుందరం బగుమూర్తి
యలయించు వనవాసములకుఁ దగునె?
నిగనిగల్ గలిగి యొప్పారగనున్న కురులు ని
శ్చలిత జటాబంధములకుఁ దగునె?

భువనపాలనాఢ్య భుజశక్తియుక్తుఁ డీ
గతి దరిద్రగతిని గాంచఁదగునె?
పాపిదైవ మెట్టి వ్యత్యస్త మొనరించె
మారులీలగల కుమారు నితని.

నార : (పటముచూచి పెదవి విఱిచి) ఓహో! ఈతఁడా!

అశ్వ : ఈ పటముం జూచి పెదవి విఱుచుచున్నారేమి? ఎవ్వరీ పురుషుఁడు?

నారద : రాజేంద్రా ! వినుము—

ఉ. సత్యము నిత్యమున్ బలుకఁజాలుట నీతఁడు సత్యవంతుఁ డా
దిత్య సహస్ర దివ్యతర తేజుఁడు సాళ్వకుమారుఁ డామర
స్తుత్యుఁడు నష్టరాజ్యుఁడయి శోభదొఱంగినవాఁడు వీనికిన్
నిత్యముగాదు జీవితము నీసుత వీనినిఁ గోర నెట్లగున్.

అశ్వ : అనఁగా—నించుక స్పష్టముగ నెఱిఁగింపుఁడు.

నారద : ఇఁక నొక్క సంవత్సరముమాత్ర మీతని కాయుష్కాలము గలదు.

అశ్వ : సరిసరి ! ఆయుష్కాలమే కొఱఁతపడియెనా ? రాజ్యభ్రష్టుఁ డైనను, విష్ణువును సాగరునివలె, శంకరుని హిమవంతునివలె నీతని నిల్లఱికఁబునైన నుంచుకొననెంచితిఁ గాని, ఆయుష్కాల మెక్కడినుండి తేఁగలను ?

మాళ: అమ్మాయీ ! వింటివా ! నారద మునీంద్రుని పలుకులు ? ఇప్పటికైన వీనిపైఁగల నీ హృదయంబు మఱల్చుకొని మఱి యొక రాజకుమారుని గోరుకొని సుఖమంది మా సంతాపంబుఁ బాపుము. సావిత్రీ వరప్రభావంబున మా గర్భంబున లేక లేక నీ వొక్కతెవు జన్మించితివి ! బిడ్డా ! నీ పట్టుదల మానుము.

సావి : జననీ జనకులారా ! నారద మునిచంద్రమా ! ఎందుల కీ మాటలు ! నిశ్చితంబైన నా సంకల్పంబున కెన్నటికిని నన్యథాత్వంబు చేకూరఁజాలదు. ఒక్కరుమాత్ర మీ భూమిపై చావకుండ నాకల్పాంత ముట్టిగట్టుకొని యూఁగులాడుదురా ! నా ప్రాప్త మెట్లున్న నట్లు కాఁగలదు. నే నీతనిం దక్క వరింపను. ఆయుష్కాల మున్ననేమి లేకున్ననేమి ? రాజ్యాద్యుత్తమ భోగంబు లున్ననేమి లేకున్ననేమి ?— ఆ దివ్య మూర్తియందే లీనముచేసిన నా మనస్సు మీ మాటలచేత

మెఱులునది గాదు. నారద మునీంద్రా! విజ్ఞానసారులగు తమరు సైతము నా తల్లిదండ్రులవలెనే మాటలాడిన నే నేమనఁ గలదానను—

క. వినుము మనోవాక్కా-యము
లన మూఁడు తెఱంగు లందు నంతఃకరణం
బనఘ! ప్రధానము గావున
మనమునఁ గైకొన్న భర్త మానందగునే.

నరకకారణంబగు వ్యభిచారంబగు—నే నొల్లను. తండ్రీ! పవిత్రుండవైన నీ గర్భంబున సావిత్రీ వరంబున జనియించిన నా మనస్సు కళంకభావంబునఁ బ్రవేశింపదు. మీ రిఁక నా కేమియుఁ జెప్పకుఁడు!

[ అనుబంధము 6 ]

అశ్వ : నారద మునీంద్రా! ఇందుల కేమి చేయనగును?

నార : రాజేంద్రా! నీ తనయ సంకల్పము సామాన్యము గాదు. పుణ్యకాంతకు దైవ మనుకూలుండగును. ఈమె పతివ్రతాత్వ ప్రభావంబున నొకవేళ సత్యవంతుని మరణంబు తప్పినఁ దప్పనే వచ్చును. కావున నీమె కోరికఁ దీర్పుము. రాజపుత్రీ! సావిత్రీ!! నీ పతి కింక నొక్క సంవత్సరమునకు మరణంబు గలదు; దానిం దప్పింప నీవు సాధ్వీమతల్లివై తివేని సాధ్యమే యగును. త్రిరాత్ర వ్రతదీక్షయు, సావిత్రీ పూజావిధానంబును నీ వరమరక చేయుము. పైన నీశ్వరుఁడు గలఁడు.

సావి : తాపసేంద్రా! ధన్యురాలనైతిని.

అవనిక జారును

## ౨వ రంగము

ప్రదేశము — ఉద్యానవనము

[ సత్యవంతుడు — ప్రవేశము ]

సత్య : అకటా ! ఎంత మఱవఁదలంచిన నా కన్యాలలామ రూపరాశి నా కన్నులంగట్టినట్లుండి విడువకున్నదిగదా !—

[ అనుబంధము 7 ]

సీ. నాఁడు శార్దూలంబు నోడించినప్పుడు
కలవాణి సత్కటాక్షములఁజూచె
కట్టుపుట్టము కంటకములఁ జిక్కిననాఁడు
ననుఁ గావుమని దైన్యముననుజూచె
అలరుదోయిట పుష్పములు వోయునప్పుడు
నాగుండె జల్లన నాఁగిచూచె
సఖిపై మృషాకోప సంభ్రమంబున పోవు
నప్పుడించుక మోముఁ ద్రిప్పిచూచె
నిన్నివీక్షణములు నెదనాటి నన్ను తా
పమున ముంచు సర్వసమయములను
నిదురరాదు తినఁగఁ గుదురా మనసులేదు
పంచశరుని సత్ప్రభావమేమొ.

[ సుమాలి — ప్రవేశము ]

సుమా: (తత్తరముతో) సత్యవంతా ! రక్షింపుము. రక్షింపుము.

సత్య : సుమాలీ ! నీ కేమైనది ?

సుమా: ఇంకేమైనది ! ఈ యడవిలోనైనను మనము శాంతముగ నుండువిధము లేదయ్యెను. సర్వనాశన మైనది. నీవు తొందర పడకుండ, సకలాశ్రమవాససంహారం బగును.

సత్య : విషయమేమో యెఱిఁగింపవేమి ?

సుమా: దురాత్ముఁడగు నీ శత్రురాజు, సేనలతో వచ్చుచున్నవాఁడు.

సత్య : (ఆగ్రహముతో) ఔరౌరా! నీచుండగు చిత్రకేతు హాతకుఁడు మ మ్మింకను కాననాంతరములకు సయితము వెన్నంటి వచ్చు చున్నవాఁడా! (శరచాపము లెత్తి) ఓరీ! దుష్ట చిత్రకేతు హాతకా! ఇంతవఱ కెటులో బ్రదికితివి గాని, మృత్యు దేవతను వలె న న్నన్వేషించుచు నిటకు వచ్చిన నీ వింక బ్రదుకవు. నీ జీవితాంతమగు దుష్కాలంబు దాపురించినందున నే నీకీ పాడు బుద్ధి గలిగె!——

శా. రారా! సజ్జనవంశ కాననకుఠారా! నేను లేకున్నచోఁ
ఘోర న్యాదగు రాజ్యసర్వమును సంపూర్ణోద్ధతింగెల్చి యీ
కారారణ్యముఁ జేరి వెండియు నముం గారింపఁగా వచ్చితే
క్రూరా! ని న్నడఁగింప నెత్తితి నిదే కోదండ ముగ్రోద్ధతిన్.

[ అశ్వపతి పరివారముతో — ప్రవేశము ]

అశ్వ : రాజపుత్రా! సత్యవంతా! శాంతింపుము. శాంతింపుము. పరులపై నెత్తఁదగిన కోదండమును బాంధవులపై నెత్తకుము! నేను నీ కహితుండఁ గాను. మత్కుమారి యగు సావిత్రి నినుఁ గోరినందున, నామెను నీ కిచ్చి కల్యాణం బొనరింప వచ్చిన శ్వశురుండను. ఈ సేనాసమూహములు నీ కల్యాణా నందము నానందింపవచ్చినవిగాని నీకపాయంబు సలుపరాలేదు.

సత్య : (తనలో) పరమేశ్వరా! నీ కరుణారసంబు నాపై నిప్పుడు వెల్లువయై ముంచుచున్నదిగదా! (ప్రకాశముగా) మహాత్మా! ఎఱుఁగక నాచరించిన నాదోషము సైరింపుఁడు. సుమాలీ! ఆశ్రమంబునకు మార్గముఁ జూపుము.

[ అందరు నిష్క్రమింతురు ]

——: o :——

## 3 వ రంగము

ప్రదేశము — ద్యుమత్సేనుని ఆశ్రమమునందు కల్యాణమండపము

[ సావిత్రీ, సత్యవంతుడు, ద్యుమత్సేనుడు, భవాని, అశ్వపతి, మాళవి, సుమాలి, సరస్వతి, బ్రాహ్మణులు, పరివారము మొదలగువారు — ప్రవేశము ]

బ్రాహ్మ: సుముహూర్తము మించిపోవుచున్నది. ఇంకేమాలస్యము ?

ద్యుమ: అశ్వపతి రాజేంద్రా! రాజ్యభ్రష్టులమగు మాకు సుకుమారి యగు నీ తనయ నిచ్చి దానిం జిరకాలము దుఃఖింపఁజేయుట నీకుఁ దగదని యెంత చెప్పిన వినవైతివి ! హతభాగ్యుఁడనైన నేను నీతో వియ్యమందు స్థితియందు లేనైతినని మిగుల లజ్జ వొడము చున్నది.

అశ్వ : బావగారూ ! మా తనయ మీ వానిఁగోరి వరించినది. భాగ్యంబు లున్ననాఁడు చుట్టరికంబును, లేనినాఁడు దూరా సీనతయు నీచులగు వారికి లక్షణములని వినుదును. చంచలురా లగు లక్ష్మి యెవ్వరికి శాశ్వతము ? కావున మా యభీష్టంబు నకు మీ రేమియు నాటంకముఁ బలుకకుఁడు.

ద్యుమ : నీ యిష్టమునకు నే నేమి వ్యతిరేకము చెప్పఁగలను !

అశ : విప్రులారా ! ఇంక మీపని నారంభింపుఁడు !—(సావిత్రీసత్య వంతులు చేతులు చేర్చిపట్టి) నాయనా ! సత్యవంత !—

ఆ. వె. శర్వు నభిలషించి పార్వతి కైలాస
మందు సకలసుఖము లందినట్లు
మదిని నిన్నుఁగోరె మాబిడ్డ దీని నె
ల్లలుకొనెదవో మహీశతనయ !

ఆ. వె. కనకభూషణములఁ గాంక్షింపఁగాలేదు,
చిరము రాజ్యకాంక్షఁ జెందలేదు
వనములందు మీరు మునివృత్తినుండఁ జె
లంగుఁగాక ! సర్వమంగళములు ! !

[ సావిత్రీ సత్యవంతులు పుష్పహారములు వేసికొందురు. అందరు ఆశీర్వదింతురు ]

మాళ: నాయనా ! సత్యవంతకుమారా !

సీ. దట్టమౌ మేల్పట్టుబట్ట గట్టఁగ నోచు
నేరీతిఁ దాల్చునో నారచీర ?
సావిత్రి నర్చింపఁబోవఁగాఁ శ్రమ జెందు
సేవల నేరీతి జేయఁగలదొ ?
ప్రమదవనంబున బడలుకోమలి యర
ణ్యములయం దేరీతి నడువఁగలదొ ?
కలమాన్నములకుఁ దప్పలుపట్టు మాబాల
యెట్లు కందలను భుజింపఁగలదొ ?
మంచిచెడ్డ లింక మదినెఱుంగనిగోల
యెట్టు లిచట నిర్వహింపఁగలదొ ?
తప్పవెదుకకయ నిదానింప నీ భార
మప్పగించినార మప్ప ! నీకు.

అమ్మా ! సావిత్రీ ! పతిహితవృత్తి నెట్లు మెలంగి మాకు కీర్తి దెచ్చెదవో సుమా !—

చ. చిరముగ నత్తమామలకు సేవల్చుఁజేయుచు, ప్రాణనాధు నం
తరమున కెక్కు-రీతి సతతంబు మెలంగుచు, కాననంబె నీ
కిరవగు వైభవంబుగ నహీనగుణాప్తి పతివ్రతావిధిన్
సురుచిరకీర్తిఁ దెమ్ము గుణశోభిత ! పుట్టిన మెట్టినిండ్లకున్.

అశ్వ : బిడ్డా ! ని న్నింక మేము విడువవలసిన కాలము వచ్చినదిగదా! పతితో నీవు సకలభోగంబు లనుభవించుట మా కెంతయానంద కరంబైనను, కని పెంచి పెద్దదానింజేసి, యిన్నినాళ్ళు కన్ను లలోఁ బెట్టుకొని పోషించిన నిన్ను విడువఁ గాళ్ళాడుట లేదు,

సావి : నాయనా ! ధీరమానసులగు మీకిది తగునా ?—

[ అనుబంధము 8 ]

చ. తనయులఁ గన్నవారికి స్వతంత్రము పెండిలి సేయుదాక ; మీ
మనమున భ్రాంతినందెద రమాయకులై తివ రెంచిచూడ మా
జననియు మీకుఁ గల్గుట విశాంపతి ! ఈగతిగాదె ! యింక నీ
కనులను నీరు నింపక సుఖంబుగ నింటికిఁ బోవరే వెసన్.

[ అనుబంధము 9 ]

ద్యుమ: రాజేంద్రా ! పురంబున కప్పుడే మీరరుగ నామది యొప్పు
కున్నది. కొన్నిదినము లిందుండి వెడలఁ బ్రార్థించుచున్నాను.

అశ్వ : పుత్రికావియోగదుఃఖము మమ్మును వెడలనిచ్చుట లేదు.
అట్లే చేయుదము.

[ అందరు నిష్క్రమింతురు ]

అవనిక జారును



# సంగీత సావిత్రి

## పంచమాంకము

### 1 వ రంగము

ప్రదేశము — సావిత్రీదేవి పూజ మందిరము

[ సావిత్రి . — ప్రవేశము ]

[ అనుబంధము 10 ]

సావి : (పూజ చేయుచు) దేవీ! సావిత్రీ! పరమపవిత్రీ! నీ ప్రసాదంబున నే జనియించి, జపియించిన దాది నీ సేవాధర్మంబు నేమఱక, నిన్నుఁ బూజించుచున్న యీ దీనురాలి ప్రార్థనంబులను మన్నించి నేఁడు నా పతికి రాఁబోవు దురంత మరణ విపత్తు నాఁపి పాలింప నీకన్న నాకు దిక్కులేరు. తల్లీ !—

ఉ. నీకు విరోధులైన రజనీచరకాండములైనఁ జంపఁగా
రాకుము కావుమన్నఁ బగిరక్షణ సేతువుగాదె శాంభవీ!
నీకు చిరంబు సేవల ననేకము జేసిన దాసురాల నీ
భీకరకష్టకాలమున, భీతను న న్గ్రృప నాదరింపవే!

తల్లీ ! నారదుండు చెప్పినవిధంబున నా పతికి రాఁబోవు మరణ దినం బీదినంబే—త్రిరాత్రవ్రతం బవలంబించి నిరాహారం బొనర్చి నీ పదకంజాతంబులఁ గొలిచితి. ఇప్పు డుపేక్షించిన నాజీవితంబు నాశనంబగు ; నన్నుఁ గావ నీకిదే సమయము !—

క. అంబా ! శర్వాణి ! నిరా
లంబను, నన్నుఁగావ సత్ఫలం బిపుడగు నీ
మంబున నినుఁ గొలిచితి ; నో
సాంబసతీ ! జీవితునిగ సలుపుము నాథున్.

(పూజ ముగించి) అల్లదే! జీవితేశ్వరుండు పరశువును, రజ్జువును గొని యిటు వచ్చుచున్నవాఁడు. ఫలపత్రకాష్ఠ సంచయంబుల సమకూర్ప నడవి కరుగుచున్నవాఁడు. ఈ దినం బేమైన సరే! నే నీ పుణ్యపురుషుని బాసియుండను.

[ పరశు రజ్జు పుచ్చుకొని సత్యవంతుడు — ప్రవేశము ]

సత్య : ప్రాణనాయకీ! త్రిరాత్రోపవాస మూలకంబగు నీ పవిత్ర వ్రతంబు సక్రమంబుగ నిర్వహింపఁ బడినదా?

సావి : మీ యనుగ్రహమున—నాథా! ఇదే భవానీ ప్రసాదము. (ఇచ్చును)

సత్య : (కన్నుల కద్దుకొని) దేవి! నీవు కష్టము బడలియుంటివి. పర్ణశాల యందు దించుక విశ్రమింపుము. నే నడవికేగి ఫలపత్రకాష్ఠ కుశాదులను సమకూర్చుకొని వచ్చెదను.

సావి : నాథా! నాదొకమనవి గలదు.

సత్య : సాధ్వీ! అది యేమి?

సావి : ప్రాణేశ్వరా!—

చ. వనమున మీరు కాష్ఠఫల పత్రచయంబుల సేకరించు నే
ర్పును మనసారఁ గన్గొనఁగఁ బొందితి మెం డగుకోర్కె—కాన మీ
మనమున సంశయింపక, సమంచిత దివ్య వనాంత సీమకున్
నను గొనిపోండు; ప్రీతియగు నామది నట్లయిన న్మనోహరా!

సత్య : దేవీ! నీ కిప్పు డీకోరికఁ గోరఁదగిన సమయమా!—

క. ఉపవాసమునఁ గృశించితి
విపరీతముగా నరణ్యవీధికి నాతో
నపురూపముగఁ జనఁగ నీ
విపు డాకాంక్షింపఁ జోద్య మెంతయు సుదతీ!

మఱియొకప్పుడు నీకోరికఁ దీర్చెదను. నేఁడు సాహసింపకుము!—

సావి : నాథా ! ఎన్నఁడును మిమ్ము నోరు తెఱచి యొక్కకోరిక యైనం గోరినదానఁ గాను. నా కుపవాసశ్రమం బేమియును లేదు. నన్ను చిన్నబుచ్చకుఁడు —

మ. ఉపవాసశ్రమ మెంతమాత్రమును నా యుల్లంబున న్లేదు మీ
రు పరోధింపక నన్ను వెంటఁ గొనిపొమ్మో మన్మనోవల్లభా !
విపరీతంబని యెంతమాత్రమును భావింపంగలే దింకు ; నీ
విపనప్రాభవసంపద ల్గనఁగ సంప్రీతిన్ మదిన్ గోరితిన్.

సత్య : కాంతా ! కాంతారం బేమనుకొంటివి !—

సీ. సమదకంఠీరవ క్రమఘోషమే కాని
వివిధ గానాలాప విధము లేదు
తొగరుకాంతులను మోదుగుపూవులే కాని
బహుజపాపుష్ప సంభవము లేదు
ఆకాశమునకంటు టేకుమ్రాకులె కాని
సరస పుష్పిత నికుంజములు లేవు
జలజలమని పాఱు సెలయేఱులే కాని
కమలకాసారము ల్గానరావు

కొల్లగా నున్న దర్భల రెల్లుపొదలె
కాని కేతకీకుంజంబు గానఁబడదు
గహన మది యేడ నీ వేడ కదలు టేడ
చాలు బాలామణీ ! సాహసంబు వలదు.

సావి : (కన్నీరునించి) నాథా ! కుతూహలంబున మిమ్ము వేఁడితింగాక కాంతారం బిటులుండునని యెఱుంగనిదాననా !—పరాక్రమ ధనులగు మీ చెంతనుండఁ గాంతారంబు న న్నేమి సేయును ?

సత్య : బేలా ! ఇంతమాత్రమున కేల కన్నీరు గార్చెదవు ! నా తలిదండ్రులు నీరాక కనుమతింపరని యట్లంటిని.

సావి : నాథా ! అట్లయిన వారియనుజ్ఞ వడసియే వచ్చెదను.

సత్య : కానిమ్ము—నీ యిష్టము. [ నిష్క్రమింతురు ]

## ౨ వ రం గ ము

ప్రదేశము — అరణ్యము

[ సావిత్రీ సత్యవంతులు — ప్రవేశము ]

సత్య : [ అనుబంధము 11 ]

సావి : జీవితేశ్వరా! మన మీవనంబునకువచ్చి పెద్దయుం దడవైనది. అత్తమామలు మనకై యడలుచుందురు. సేకరించిన పుష్ప పత్రంబులు చాలు. ఇంక కుటీరంబునకు మరలుదమా?

[ అనుబంధము 12 ]

సత్య : కాంతా! ఇంచుక తాళుము సమిధలం గొన్నింటిని సంగ్రహించినపిదప—మరలిపోవుదము. బలిష్ఠజీర్ణ వృక్షంబు లాదవ్వున నున్నవి. పోవుదము రమ్మ. ఇటు ఇటు—

సీ. పాచిపట్టిన రాలపైఁ గాలుజారు తి
న్ననిదారిఁ గన్గొని నడువవలయు
ఫలభారమున పాదపములు భూమికివంగె
నించు కౌదల నీవు వంచవలయు
సెలయేటికాల్వల మడుగు లేర్పడె నిందు
కుచ్చిళ్ళు చేపట్టుకొనఁగవలయు
కోసలుగోసినదర్భ లసురపోలిక నున్న
వించుకజాగ్రత్త నేగవలయు

పడఁతి! యుపవాసముల నీవు బడలినావు
నా భుజస్కంధమున నాని నడువవలయు
అల్లిబిల్లిగ తీవ లిం దల్లుకొనియె
నాదు కేల్పట్టి మెల్లన నడువవలయు.

మానినీ! ఈ వనం బెటులున్నదో చూడుము—

సీ. అంబరమంటునో యనుభ్రాంతిఁ గొలిపెడు
మహితోన్నతములైన మ్రాకులివ్వి
ఇరుగెలంకుల తరు లిరవొంద జలజలఁ
బాఱెడు పెనుగొండ వాగులివ్వి
పూజాదులకు ఫలపుష్పముల్ గొనియెడు
భాసురంబులు నుపవనములివ్వి
వటులు సమిత్కుశాదళి సేకరించెడు
వాటంబులౌ వనవాటులివ్వి
వరలతౌషధములఁగల యిరవు లివ్వి
వైశ్వదేవాదివిధులకువలయు శ్రేష్ఠ
మైన నీ వారిధాన్యంబు లమరు నిచట
మునుల కిరవైన పావనవనములివ్వి.

సావి : (తనలో) ఈ వనసౌందర్యంబును నాథుఁ డెంతవర్ణించుచున్నను దురంత విచారావిష్టమైన నా మదికి నిండారు సంతసం బొదవకున్నయది. (ప్రకాశముగా) నాథా! ఇంధనంబులకుఁ దగిన తరురాజంబు లిందున్నవి. సత్వరంబుగఁ గార్యసాధనంబు గావించుకొని కుటీరంబునకు మరలుదము రమ్ము.

సత్య : దేవీ! ఈ తరు వసంతమై—బహుశాఖాపరిపూరితమై వున్నది. దీని నధిరోహించి యింధనంబులం గొట్టెదను. (చెట్టెక్కును)

సావి : (తనలో) ఇప్పటికి రెండవయామంబు దాఁటినది. ఇంతవఱకు నాపతి నిరామయుండై వున్నవాఁడు. ఓ దేవీ! కాత్యాయనీ! సర్వమంగళా! ఇంతవఱకు మమ్ము దయార్ద్రదృష్టి వీక్షించినట్లే మంగళకరంబుగ నీ దినంబు గడపి నా నాథునిఁ గాపాడుము.

సత్య : (గొడ్డలి క్రిందవైచి చెట్టుదిగును)

సావి : (తనలో) ఏమిది ! నాథుఁడు సగము లోననే వ్యతూవతరణం బొనరించెను ! ఏమి ప్రమాదము గలిగినదో కదా !

సత్య : (శిరస్సును రెండుచేతులఁ బట్టుకొని) జీవితేశ్వరీ ! శూలంబులతోఁ బొడిచినట్లు నా శిరంబు బాధనందుచున్నది. భరింపఁ జాలను. నిలువనైన నిలువఁజాలకున్నాను ! ఇదేమి విపరీతమో తెలియదయ్యెను.

సావి : అయ్యో ! ఇదేమి విపరీతంబై ఘటిల్లెను. జీవితేశా ! నా యంకతలంబునఁ బరుండుఁడు.

సత్య : అబ్బా ! ఏమియీ బాధ ! ఎన్నఁ డిట్టి శిరోబాధ నెఱుంగనే ! నేను జీవింతునో లేదో కదా !

సావి : పాపము శమించుఁగాక ! నాథా ! ఎట్లున్నది ?

సత్య : (మాటాడఁలేక సౌంజ్ఞ చేయును)

సావి : (తనలో) కాలము దాపురించినట్లున్నది. అక్కటా ! దీనజనాభయప్రదాయిని యగు హైమవతి కటాక్షించునని నమ్మితిని గాని ఈరీతిఁ గావించుననుకొననైతినిగదా ! అయ్యయ్యో ! అప్పుడే నాథుని శరీరమంతయుఁ జల్లపడి మంచుకుండవలె నగుచున్నది !—ఏమి ఈ ప్రకంపనము ! ఏమి ఈ స్వేదోదయము ! ఏమి ఈ త్రొట్రుపాటు ! పూర్ణిమాచంద్రుని ధిక్కరించు వదనారవిందం బప్పుడే కళాహీనమై పోవుచున్నదే !— కటకటా ! నే నేమిచేయుదును ? ఎవ్వరు నా ప్రాణనాథునకు జీవనామృతముం బోయువారు ? ఎవ్వరు రక్షించువారు ?— మరణచిహ్నంబులు నాథుని ముఖంబునం గాన్పించుచున్నవి !— శ్వాసలుసయితము మందగించుచున్నయవి !—హా ! నాథా ! నా బహిఃప్రాణమా ! నా సంపూర్ణ చంద్రమండలమా !

నా మోహనాంగా! నన్నేమిచేసి పోవుచుంటివి! తలిదండ్రులు వలదన్నను వినక—దేవముని యంతటి మహాత్ముని మాటలను సయితము ధిక్కరించి నిన్ను వివాహమాడి, కరుణామయుండ వగు నిన్ను పతిగాఁ గాంచిన ప్రేమంబుఙ్గాఁగొని నారీ మండలమున నావంటి ధన్యురాలు లేదని యానందంబునం బొంగుచున్న నా యాశాలతలను సంపూర్ణముగ నేటితో విచ్ఛేదము గావించితివా!—నిముసంబు నీవు దూరమైన దల్లడిల్లు నేకపుత్ర జీవనులగు నీ వృద్ధ మాతాపితల కేమిచెప్పి యూరడించుదానను—మహానురాగంబున నా పుట్టినింటివారిని మరపించి న న్నేల్కొనుచుంటివే! నాథా! న న్నింతల్లో వీడిపోవ నే నేమినేర మొనరించితిని? వలదన్న వెంటఁబడి యడవులకు వచ్చితినని కోపమా! నేనించుక కంటనీరు వెట్ట నాసంతాపముం జూడలేక వెంట నడవికిఁ గొనివచ్చితివే! కల్యాణమైన వత్సరంబునకే నీకు నూతేండ్లు నిండెనవా!—ఓ దేవీ! భవానీ!—నిన్నుఁ బూజించి త్రిరాత్రవ్రతంబు సల్పిన వైధవ్యంబు దప్పునని సురమునీంద్రుఁ డానతిచ్చెను గదా!—నీవైన నష్టపడి నానాథునిఁ గాపాడవైతివేమి?—దాసురాలిపై నీకు దాక్షిణ్యము చెల్లిపోయినదా! దేవతాదులయందలి భక్తి వ్యర్థమని లోకమునకు వెల్లడింపఁ దలచితివా తల్లీ! నిన్ను మూఢురాలనై సేవించితిఁగదా! అయ్యయ్యో! ఏమిది? పతిశోక విహ్వలనై దేవిని నిందించుచుంటినేమి? నా మంద భాగ్యంబున కామె యెట్లుత్తరవాదిని యగును? ఓ మృత్యు దేవతా! దుష్టజీవనులగు పాపాత్ము లెందున్ను నీ యాఁకలిఁ దీర్ప లభింపరైరా! సుగుణగరిష్ఠుఁడగు నా హృదయేశ్వరుని నాహరించిగాని నీవు సంతృప్తి నందవైతివా! తండ్రీ! అల్పాయుర్దాయము గలవాని వలదని చెప్పి నిల్లుగట్టుకొని పోరిన నీకేమి సమాధాన మిప్పుడు చెప్పఁగలను? అయ్యయ్యో!

తెరలు తెరలై—గర్భగోళంబులనిండి పైకుబికివచ్చు నీ దుఃఖ పరంపర నే విధంబున నాఁపఁగలను ? సతికి వైధవ్యంబునకన్న మిన్నయగు దుస్థితి యేది ? విధవనై జీవంబు గడుపుటకన్న పాపంబు లేదు. నాథా ! నాథా ! ! ఏమిది ! నీ సతినగు నేను సావిత్రిని ! నాతో మాటాడవేమి ? ఎన్నఁడైన నిట్లుదా నీనుఁడ వైతివా ! అయ్యయ్యో ! నా యరణ్యరోదనం బాలించువా రెవ్వరు ? పృథివియు నాకాశంబును సూర్య చంద్రులును నా సౌశీల్యంబునకు సాక్షులుగా రే ! ఈ కాలంబు సజ్జనులకా ప్రతికూలము ! హా జీవితేశ్వరా !—

సీ. మన వివాహమునాఁటి మంగళారావముల్
శ్రవణయుగ్మమునుండి జాఱలేదు
పటకుటీరంబుల పచ్చనితోరణం
బుల వర్ణమైనను బోవలేదు
భూసురాశీర్వాదముల ప్రతిధ్వనులైన
ననువుగా నింకఁ జల్లారలేదు
మనకుఁ గట్టించిన మధుపర్కములపీత
వర్ణమైనను నింక వదలలేదు
జీవితేశ ! నిన్నుఁ జేరి సుఖింప ల
జ్జాభరంబు సుంత సడలలేదు
ధీరచరిత ! నీకు నూఱేండ్లు నిండ నే
పతుల సతుల నెడలఁ బాపినావొ.

అక్కటా ! నే నీ దుఃఖమును భరించి జీవింపలేను. నాథా ! నీతోడ నన్నునుం గొనిపొమ్ము. పతి మార్గంబేకదా సతి కాధారము ! ఓ యమధర్మరాజా ! నా పతిజీవంబులతోపాటు నా జీవంబులనుగూడఁ గొనిపొమ్ము. (సత్యవంతునిపైఁబడి యేడ్చును)

[ యముడు — ప్రవేశము ]
[ అనుబంధము 13 ]

యము: (తనలో) నేను సంస్మరణమాత్ర సమస్త మర్త్యలోక భయ ప్రదుండ ననియును, పద్మసంభవ కృపా ప్రసాదిత నరకలోక సామ్రాజ్య పట్టభద్రుండ ననియుఁ, గాలపాశ ప్రయోగమాత్ర నిజకార్యాశేష నిర్వాహణ పరతంత్రుఁడ ననియు, సాధ్వి యగు సావిత్రికి నాథుండైన పుణ్యస్వరూపుండని యీ సత్యవంతుని వర్ణించి—త జ్జీవహరణంబు నా కసాధ్యంబని యధిక్షేపించిన నారదమునిఁడు నిక్కముగ మందబుద్ధి! అనేక జీవహరణ సమర్థం బగు నా కాలపాశంబున నీ క్షుద్రజీవి యెట్లు చిక్కకుండునో పరీక్షించెదఁగాక ! (పరికించి) ఓహో ! ఈ యమయే సావిత్రి కాఁబోలును ! పతివ్రతా మహాత్మ్యంబున ననన్య వీక్షణ దుస్సాధ్యంబగు మహాతేజంబున నెట్లు దీపించుచున్నది ! ఈ సాధ్వీతిలకంబు రమాసతికన్న, నుమాసతికన్న, భారతి కన్న నత్యంత పవిత్రశీల యని తోఁచుచున్నయది. కానిమ్ము. ఏమైనను, మదంగీకృత కార్యంబును నిర్వహింప వలయును.

సావి : (యమునిఁ జూచి) ఓహో ! ఏమిది ? గంభీరశ్యామల భీకరవదన తేజోవిభాసితుండును, ఆకర్ణాంత చంద్రవర్తనయున కమల యుగళుండును, ఘోర పాశహస్తుండును, రక్తాంబరాలం కృతుండును, ఆజానులంబిత దీర్ఘబాహు యుగళుండును నగు నీ మహాపురుషుం డెవ్వరొకదా ! సావిత్రీప్రభావంబున మృత్యు దేవి నెదిరించి నా నాథుని రక్షింప నేతెంచిన యొకానొక దివ్యపురుషుం డని తోఁచుచున్నది. (ప్రకాశముగా) మహాను భావా ! నీవు సిద్ధుండవో—సాధ్యుండవో— దేవపతివో— పితృపతివో—నే నెఱుంగ—నా నాథుఁ డిందు శిరోబాధచే పతితుం డయ్యె. వనలతౌషధులచే బ్రదికించి పుణ్యముఁ గట్టు కొమ్ము—నీ పాదపద్మంబు లంటి వేఁడెద,

యము: (తనలో) ఏమీ యాశ్చర్యము! మానవ లోకావలోకన దుస్సాధ్యం బగు నా మూర్తి యీ మర్త్యభామిని కంట నెట్లు పడియె! ఇందువలన నీమె మహాత్మ్యం బసామాన్యంబని నిర్ణయింపవలసి వచ్చుచున్నది. కానిమ్ము. (ప్రకాశముగా) ఓ సావిత్రీ! నేను నీపతి జీవములం గాపాడుటకు వచ్చినవాడం గాను; సత్యవంతునకు నేటితో నాయుర్దాయము మూడి నందున నాతని జీవంబుల నూర్ధ్వలోకంబునకు మత్కాల పాశంబునం గొనిపోవవచ్చిన పరేత లోకాధీశుండ—శమనుండ. (పాశము సవరించును)

సావి: (తనలో) అమ్మయ్యో! ఇఁకేమున్నది! కాలయముఁడే ప్రత్యక్షమయ్యెను! నే నేమిచేయుదును?

యము: అదిగాక, సావిత్రీ!—

చ. తపము లొనర్చువారి, క్రతుతత్పరులై విలసిల్లువారి, స
త్కృప నఖిలావనీజనులఁ గాంచెడువారిని సత్యభాషులన్
చపలత నాభటు ల్దరియఁజాలరు గావున నో తలోదరీ!
యపగతదోషకర్ముల స్వయంబుగ నేఁ గొనిపోవుచుండెదన్.

నీవు పతివ్రతా తిలకంబవగుట నేను నీకుఁ గాన్పించితిని. అన్యులకు నా మూర్తి యగోచరంబగును. నీపతి యింక నీకు లేనివాఁడు. కావున మరలుము. (పాశంబుచే సత్యవంతుని జీవంబులం గొనును)

సావి: (భయకంపితయై) అయ్యయ్యో! నే నిప్పు డేమిచేయుదును? ఈ యముండు దయమాలి నా నాథుని జీవంబుల నపహరించుచున్నవాఁడు. ఓ సావిత్రీదేవీ! ఇంక నీ కింతకన్న నన్ను రక్షించుట కేదేసమయము!—నిన్ను పూజించిన నాకు

వైధవ్యంబు ప్రాప్తించుచుండ నూరకచూచుచుండుట నీకు సమ్మతమేనా? న్యాయమేనా?—అయ్యయ్యో! నా మొఱ లేవేల్పులు నాలకింపరైరి! నే నేమిచేయుదును? (యముని పాదంబులంబడి) ఓ పుణ్యవంత! దయావంతా! నానాథుఁడు పాపకర్ముఁడు గాఁడు. నా యాఁడుకూయికిఁ జెవియొగ్గి నా నాథునివదలి నా ప్రాణంబులం గొనిపొమ్ము. ఇట్టి పరమ భాగవతుని నకాలమరణంబు పాల్సేయుట నీకు భావ్యము గాదు!— నన్ను రక్షింపుము నీకు పునః పునః ప్రణామంబుల నాచరించుచుంటిని. (సాష్టాంగదండ మిడును)

యము: ఓ శీలవతీ! ఆయుష్కాలము తీరినందున నీపతి మాచేతఁ బడెను. జీవులందఱు నిటులే తమతమకాలంబు తీరెనంగాని మాచేఁ జిక్కరు. నీ కింకను మర్త్యలోకంబున నాయుర్దాయము గలదు. కావున నింటికిఁ బోయి సుఖంబుగ జీవింపుము.

[ నిష్క్రమించును ]

సావి: (లేచి) హా! హా! యముండు నా నాథుని జీవంబులంగొని చనియెనా!—ఎంత మందభాగ్యురాలనైతిని! అయ్యయ్యో! జీవితేశ్వరా! మృణాళసమ మృదులంబులగు నీ కరంబులు పరుష కాలపాశంబునఁ బంధింపఁబడుటఁ జూచిన నా కన్నులేల నంధంబులుగా నయ్యెను!—అకటా! యముఁ డప్పుడే నాథుని జీవంబులఁగైకొని కడుదూర మరుగుచున్నవాఁడు! నా కిం దేమున్నది. నేనును నాథునిశరీరం బొక్కలతాంతరంబున భద్రపఱిచి యమునివెంట నంటెదఁగాక. (అట్లుచేయును)

[ అనుబంధము 14 ] (1)

[ నిష్క్రమించును ]

———:o:———

## 3 వ రంగము

ప్రదేశము — అసిపత్రవనము

[ యముడు — ప్రవేశము ]

**యము:** (తనలో) సమస్త జీవసంతానమునకు నేది పరమ ప్రీతి పాత్రంబో, ఎద్దాని సంరక్షణంబునకై పరమేశ్వరుండీ ప్రకృతి విలాసంబు నెల్లఁ గల్పించెనో—దేనిని పోషించుటకొఱకు మానవుఁడు జన్మారంభము మరణాంతముదనుక నీ ప్రపంచ వ్యవహారంబునందలి కష్టనిష్ఠురంబుల ననుభవించుచుండునో యట్టి యుత్కృష్టపదార్థంబగు ప్రాణంబును నపహరించు నుద్యోగంబు గలవాఁడ నగుటచే నా పేరు విన్నమాత్రంబున, ప్రపంచమెల్ల ప్రకంపితం బగుచుండును. ప్రాకృతు లనేకులు నన్ను మిగుల క్రూరకర్ముఁడనని నిందింతురు. నే నెక్కడనుందు నక్కడ — శోకారవంబులు — పితృకర్మంబులు — నపసవ్య ధర్మంబులు — నశుచియు శేషించుచుండును. కాని, యొక్క రును పుట్టుట గిట్టుటకొఱకేయనియు, నా ధర్మంబు నే నాచ రించితిననియుఁ దలంచి యానందింపరు. దూషితోద్యోగంబుఁ గలవాఁడయ్యును, నీ సత్యసంతునివంటి పుణ్యజీవుల భుజంబున వహించుచుండుటచే నా పాప లేశంబులు పటాపంచ లగు చున్నవి. (ఆలకించి) ఎక్కడిదీ యార్తారవంబు? (పరికించి) ఓహో! ఏమి యద్భుతము? ఈ సావిత్రి నన్ను వదలక వెంటఁ బడి వచ్చుచున్నదే పాపము! ఇంతటితోనైన వలదని వారించెదఁగాక!

[ సావిత్రి — ప్రవేశము ]

[ అనుబంధము 14 ] (2)

**సావి:** (శోకముతో) ఓ యమధర్మప్రభూ! దూరము పోకుము. నా నాథుని నాకిచ్చిపొమ్ము. నీవు దయాస్వాంతుఁడవని

యాగమచతుష్కము నిర్ఘోషించుచున్నయది. నీ ధర్మగుణంబు నిలుపుకొనఁ దలంచితివేని, నాజీవనాథునినాకిమ్ము నేననాథను. అభాగ్యను. నిన్ను వేఁడితిని. నీ పాలఁబడితి. నా ప్రార్థనముల వ్యర్థముసేయకుము ! (నమస్కరించును)

యము: సావిత్రీ !—ఏమి నీ సాహసము ! ఎంతయుఁ దెగించి కంటకాభీలపాషాణ భీభత్సంబగు నీ యసిపత్ర వనాంతరంబునకు నావెంటఁబడి వచ్చితివి. మృతినందిన ప్రాణియెన్నఁడును మరల, పునరాగతుండు గానేరఁడు. నీ భ్రాంతి మాని మరలి పొమ్ము—

మ. బిసజాతేక్షణ ! ఖడ్గపత్రయుతమై భీభత్సమై ఘోరమై
నిసితంబై భయదాయకంబగుచుఁ బ్రాణి ప్రాణహారంబునై
యసిపత్రంబను ఘోరకాననము సుమ్మా ! ఈ ప్రదేశంబు ; సా
హసముం జేసి చొఱంగవచ్చితి వపాయం బౌను మున్ముందటన్.

అదిగాక, యీ ప్రదేశంబు నల్వంకలం జూడుము—

* సీ. అనిలంబు గ్రోలి గస్సని లేచి బుసవెట్టు
నురుభీమకాలాహు లొక్కచోట
ఎనయుమంటలతో చెటేల్ పెటేలనికాల్చు
నుజ్వాలదావాగ్ను లొక్కచోట
గాండ్రు గాండ్రంచును గాండ్రించు భీమ మ
హోగ్ర శార్దూలంబు లొక్కచోట
అవిరళవాతాప్తి చెవులు గీపెట్టఁగా
నొప్పు వెదురొప్పెద లొక్కచోట
కంటకవికీర్ణ భీభత్స కాననములు
నురుతరగిరి వ్రజంబులు నొక్కచోట
నలరు నీ ప్రదేశం బగణ్యంబు సుమ్ము
వినుము నామాట వెనుకకుఁ జనుము బాల !

* ఇది గ్రామఫోనుప్లేటులో బ్రహ్మశ్రీ బ్రహ్మజోస్యుల సుబ్బారావుగారిచే చదువఁబడినది.

సావి : ఓ సకలధర్మాధర్మ ప్రతిపాలనశీల ! పతి ప్రాణానువర్తనంబగు పవిత్రధర్మంబుగల నాకివియన్నియు భయకారణంబు లగునే ! ఉగ్రారణ్యమైననేమి ? మహోగ్ర కాంతారంబైననేమి ? సుగుణాగ్రేసరుండగు నా పతియున్న ప్రదేశమే నాకు నందన వన సన్నిభముగాదే !—ఇట్టి యార్యసతుల ధర్మంబులు మీవంటి మహాత్ములుగదా నిర్వచించుచుందురు. మీ రిట్లు విపరీతంబుగ సెలవిచ్చుట భావ్యమేనా ?

యము: అట్లయిన నీ వెంతదూరము వచ్చెదవు ?

సావి : ప్రేతలోక చక్రవర్తీ ! నాపతి యెంతదూరం బరుగునో నేను నంతదూరము వచ్చెదను.

యము: నీపతి నాలోకంబునకు నాతో వచ్చును.

సావి : నేనును నాపతితోడనే వచ్చెదను.

యము: నీ కట్టి యధికార మేది ?

సావి : ఏలలేకుండును మహాత్మా ! మీ యనుగ్రహమున్న—

యము: బాగుబాగు. నీపతి మరణించినవాఁడగుటచేత, సూక్ష్మ శరీర ధారియై వచ్చుచున్నవాఁడు. నీ వీ స్థూలదేహంబుతో నెట్లు వచ్చెదవు ?

సావి : మహాభాగా ! స్థూలదేహంబుతోడ నింతదూరము వచ్చిన దాన నింక మఱికొంతదూరము రాలేకుందునా ?

యము: వచ్చి యేమిచేసెదవు ?

సావి : మీ సన్నిధిని పతిపాదంబులఁ గొల్చుచుండెద.

యము: భళీ ! నీవంటివిద్వాంసిని నే నింతవఱ కెందును గనివిని యెఱుంగ. పతిమరణానంతరంబున భౌతిక దేహంబు నగ్నిఁగాల్చి పరలోక

ప్రాప్తినందిన యుత్తమాంగనలం గంటినిగాని భౌతికంబగు స్థూలశరీరంబుతోడ నన్నువెన్నాడి వచ్చిన కాంత లెవ్వరును లేరు. వెఱ్ఱిదానా! నీ వింకముం దెట్టి దుర్గమమార్గంబులు గలవో యెఱుంగక భ్రాంతవై పలుకుచుంటివి. ఇప్పటికే కడు దూర మరుదెంచితివి! ఇంక మఱలుము. అప్పుడే మార్గము దుర్గమమై పోవుచున్నది. నీకిది సుపథము గాదు.

సావి : మహానుభావా! పతిభక్తి యను దివ్యతేజంబు నాకు మార్గ ప్రదర్శకమై యెట్టయెదుట దేదీప్యమానమై వెలుంగుచుండ నాకీపథంబు సుపథంబే యగుచున్నయది. నన్ను వారింపకుము.

యము: అట్లయిన కాలుండనగు నా యానతి నతిక్రమింతువా?

సావి : మహాత్మా! నా పతిని నా కిచ్చినచో నీ యానతి మీఱు నంత పాపాత్మురాలను గాను.

యము: (తనలో) ఓహో! ఇదియేమి? నారదుండు చెప్పిన చందంబున నీమె తుదవఱకు నన్ను విడుచునట్లు గాన్పింపదే! (ప్రకాశముగా) ఓ రాజపుత్రీ! సావిత్రీ!! నీవు మా వెంటనంటి బహుదూర దేశంబుల శ్రమనంది వచ్చితివి. కుసుమపేశలం బగు నీ కోమలశరీరం బిదివఱకే—యసిపత్ర క్రూరనిస్త్రింశ(?) తాగం బులచే బాధనంది రక్తసంఛన్నంబయ్యె. పాదములు పాషాణ కంటక వితానంబులచే బొబ్బలెక్కెను. నీ పతి జీవితం బిఁక నీ హస్తగతం బగుటగాని—యకాలంబున నీవు మన్మందిరంబున వసించుటగాని సంభవింపదు. నిరర్థకంబగు నీ శ్రమ చాలించి మరలిపొమ్మని పలుమారులు బోధించినను చెవిఁ జేర్పకుంటివి. జీవులు తమతమ పాపపుణ్య ఫలానుసరణంబుగఁ గ్రమంబునఁ బశుపక్షి క్రిమికీటక మానవాది జన్మంబులఁ గాంచ, బహుయోనులందుఁ బుట్టుచుఁ జచ్చుచుఁ దాపత్రయం

బుల ననుభవించుచుండును. నీ ప్రాణేశ్వరుం డన్ననో—నిత్య సూనృత వచోనిపుణుండును, మాతృ పితృ సేవారతుండును, పరమేశ్వర నిత్యపూజానురక్తుండును, దయాశీలుండును నగుటం జేసి—మద్భువనంబున ఫలనిర్ణయం బొనరింపఁబడి పునరావృత్తి రహితంబగు నక్షయలోక సుఖంబుల నందఁ గలఁడు. ఆతని కీ పాప మర్త్యలోకంబున నింక సుఖదుఃఖాను భవంబున కాస్పదములేదు. కావున నో సతీతిలకమా! నా వెంటబడిరాక నీ వింటి కేగుము.

సావి : ధర్మపాలన చక్రవర్తీ!—రవినందనా!—

క. యముఁ డంద్రు నిన్ను లోకులు
యమియింపుదు భూతతతుల నట్లగుటతగన్
శమనుండవైతి కల్మష
శమనంబునఁ జేసి నీవు జలజాప్తసుతా!

ఇట్టి నీ వెఱుంగని నిగమధర్మంబు లల్పజ్ఞనగు నా కెఱుంగ వచ్చునే!—దేవా! నీ వాడినమాట నా హృదయపాటవ విపాటనంబునకుఁ జాలి నన్నెంతయు జాలి దూలించుచున్న యవి. మహాత్మా! నే నెఱింగిన వేదపాఠంబులయందు పతుల మార్గమే సతులకు నిర్ణయింపఁబడియుండ నిప్పుడుమాత్రము నా పతిమార్గంబు నాకేల నర్హము గాకుండును! నన్నుఁ బరీక్షింపవలయునని ఒకవేళ మీరిట్లాడుచుందురని తలంతును. ప్రేతనాథా! నీ వెంతపరీక్షించిన నా పట్టుదల మానుదానఁ గాను సుమా!

యము: ఓ సాహసురాలా! ఏమి నీవాక్పాటవము! భీతిలేక నా వెంట వచ్చుటేకాక, నాతోడ వాదంబునకు దొరఁకొంటివేమి! పొమ్ము నీదారిని.

సావి : (దీనముగ) మహాపురుష! నీ పాదంబులంబడి దీనత వేఁడుకొను చున్న నేను, నీ వాగ్రహించిన నే నెం దరుగఁ గలదానను?— సమస్త ధర్మప్రతిపాలన దక్షుండ వగుటగదా నిన్ను నలువ ధర్మదేవతగా సృజించెను. అట్టి నీ వార్యధర్మ ప్రతిపాలనంబు సల్పి—దీనజనవత్సలుండవై —నాకభయహస్తంబిచ్చి రక్షింపుము. సఖ్యము సాప్తపదీనంబని నీవంటివారు చెప్పుదురు. అట్టిఎడ ననేక యోజనంబులు నడచివచ్చిన నీవు నాకు బాంధవుఁడవైతివి. అదిగాక దీనబంధూ! ధీనురాలనగు నాకు బాంధవుఁడవై యన్వర్థ బిరుదాంకితుఁడవు గమ్ము. నా జీవితేశ్వరుని తలిదండ్రు లంధులై వనంబున దిక్కుమాలిన పక్షులవలె నడలుచున్నవారు. వారిం గావ నన్యరక్షణంబు లేదు. నా పతిని నా కిచ్చితివేని, శీఘ్రముగ నరుగుదాన. నిన్ను పీడింపనోప.

యము: (తనలో) ఆహా! శిలలనైన ద్రవీభూతము చేయఁజాలు నీ సాధ్వి యాక్రందనమునకు మనస్సు కరఁగియు నేఁగాఠిన్యము వహింపవలసివచ్చెఁగదా! (ప్రకాశముగా) సావిత్రి! నీ శీల సంపద నాకు మెప్పు గలిగించెను. నీ పతి ప్రాణంబులు దక్క— నీ కొక్కవరమిచ్చెద; దానింగొని మారాడక చనుము.

సావి : (తనలో) దేవీ! భవానీ! నీవు కృపారహితురాల వనుకొంటిని గాని నీ దయారసప్రావముం గురుతింపనైతిని. కానిమ్ము. ఈయన యనుగ్రహంబు నేల చెడఁగొట్టుకొనవలయును? ఇప్పటి కీవరంబుగొని మరల నాధుని జీవంబులకై వెంటఁబడెదఁగాక! (ప్రకాశముగా) ఓ వైవస్వత! నీ యనుగ్రహమంది ధన్యురాలనైతిని—

ఆ. వె. కనులు లేక రాష్ట్రమునుఁబాసి నామామ
యుగ్రవనుల నడలుచున్నవాఁడు ;
వాని నొసఁగి యా మహానుభావునకు న
భ్యుదయమగు వరంబు నొసఁగుమయ్య.

యము: ఇచ్చితిని. నీ వింక నా వెంట రాకుము. పొమ్ము.

[ నిష్క్రమించును ]

సావి : అక్కటా ! యముఁడు నా పతిప్రాణములను మరలఁ గొని యరుగుచున్నవాఁడు. నాకుమాత్ర మిం దేమియున్నది. క్రమంబుగ వెంటఁబడితినా దయామతియగు నీ పుణ్యాత్ముండు నన్నేల వ్యర్థపఱచి పంపును ! పరవిపద్వీక్షణంబునం దసహాన ముత్తముల లక్షణంబుగదా ! ఓ తల్లీ ! సావిత్రీదేవీ ! నీ యనుగ్రహంబున నిప్పటికి నా యత్తమామలకు నేత్రంబులును, రాజ్యాద్యుత్తమ భోగంబులును సమకూరినవి. కృపాంతరంగితాంతరంగవై యముని మానసంబును ద్రవింపఁజేసి నా పతిని నా కిప్పింపుము. నీవే శరణ్యము. (ముందుఁజూచి) అప్పుడే యముఁ డతిదూరంబు నడచిపోయెను. నేనును రయంబున నరుగవలయును.

[ అనుబంధము 14 ] (3)

[ నిష్క్రమించును ]

—— : o : ——

# 4 వ రంగము

ప్రదేశము — వైతరణీప్రాంతము

[ యముడు — ప్రవేశము ]

యము: (తనలో) ఏమి యీ సావిత్రి సాహసము !—

సీ. ముండ్లనేలలఁ గాలుమోప భీతిల్లదు
మదగజంబులనైన నెదురుకొనును
బుసలుగొట్టెడు సర్పములకైన వెఱవదు
గ్రానల కీలలందైనఁజొచ్చు
వివిధ నిమ్నోన్నతా భీలశృంగములెక్కు—
నలయదు రవిపదాహాతులనైన
అవలీలగాఁ బ్రవాహములనైనఁ దరించు
గమనశ్రమంబైనఁ గాంచఁబోదు ;

ప్రాణనాథునియందలి భక్తియే ని
రంతరంబైన సద్వ్రతంబై యొసంగ
నెట్టికష్టంబులును గాంచదీమె భళిర !
వెలఁది సావిత్రి పరమపవిత్రయయ్యె.

నారదుండు నాతో వచించినంతకన్న మిన్నయై ఈ యన్నుల మిన్న చూపట్టెడి. కానిమ్ము. ఇంతవఱకు రాఁగలిగినదిగాక యిఁక ముం దీమె నావెంట రాఁజాలదు. దుర్భేద్యమై మహోన్నతంబైన నగరాజంబును, దాని కావల నరులు తరింపరాని వైతరణీనదియుం గలవు. నే నీమెకుఁ గనఁబడకుండఁ బర్వతంబుమాటున కరిగెద.

[ నిష్క్రమించును ]

[ సావిత్రి — ప్రవేశము ]

సావి : (ఆతురతతో) రవితనయా ! నన్నుఁబాపి నా ప్రాణేశ్వరుని గొనిపోవుట నీకు న్యాయము గాదు. నిలువుము. నిలువుము—

(దిక్కులు పరికించి) అక్కటా? శమనుం డెందో చనియెను. నా కాతని మార్గము నెఱింగించువా రెవ్వరు?—ఈ మహో న్నత గిరిరాజంబు నారోహించియుండునా? అక్కటా! ఇది కడుదుర్గమంబై తోఁచుచున్నదిగదా! (సాహసముతో) ఏమి నావెఱ్ఱి! ఇంతదనుక నేను నిర్గమించిన మార్గము సుగమంబును నిది దుర్గమంబును నగునా! సావిత్రీ కటాక్షంబునను, నా పతి భక్తి ప్రభావంబునను, నేను సాధ్వినైతినేని నా కీ గిరిరాజంబు క్షణమాత్రారోహణ సులభం బగుఁగాక! (పర్వత మెక్కును)

[ అనుబంధము 14 ] (4)

[ యముడు — ప్రవేశము ]

యము: ఆహా! ఈ సాధ్వీమణి చరిత్రం బెంత విచిత్రమైనది. ఈ పర్వతంబుగూడ నిర్గమించినదే! ఐనను—వైతరణీ నదిం దాఁట నీమెకు సాధ్యమగునా!

సావి: (యముని జూచి) ఆహా! నయనానందకరుండై ధర్మప్రభువు దర్శనం బిచ్చుచున్నవాఁడు. (వేగముగ యముని పాదములం బడి) పవిత్రచరిత్రా! తపనపుత్రా!!—నన్ను రక్షింపుము. నన్ను రక్షింపుము. నా నాథుని నాకుఁ బ్రసాదించి నన్నుఁ బాలింపుము.

యము: ఓసీ యున్మత్తురాలా! ఎంతకుఁ దెగించితివి! ఇంకను నా వెనువెంటఁబడి వచ్చుచుంటివా?—

సీ. మృదువులై కొదమతుమ్మెద గేరెడు దీర్ఘ
కేశంబులెల్లఁ జీకాకువడియె
ప్రేమభాజనమై శిరీషపేశలమైన
కాయమంతయుఁ గంటకములనొచ్చె
ముగ్ధమై స్నిగ్ధమై పొలుపారు నీ ఫాల
భాగమంతయును బాష్పములనిండె
లలిత పల్లవకోమలములైన పాదంబు
లబ్బురంబుగ పలుబొబ్బలెక్కె

వరదుకూలంబు శాతాసిపత్రములను
జీరుకొనిపోయి పేల్కలు చీల్కలయ్యె
సదమలాస్యంబు ధూళిధూసరితమయ్యె
చాలు నా వెంటవచ్చుట సన్నుతాంగి !

సావి : మహాభాగా ! నీ విట్టి యధర్మోపదేశంబు నా కొనరింపc బాడి గాదు. పవిత్రంబైన నాయాత్మ కేహానియుc గలుగలేదు. క్షణభంగురంబైన యీ శరీరబాధలను గణింపనేల ?

యము: బాలా ! నీ కింతకుము న్నొకవరంబిచ్చి వెడలిపొమ్మని చెప్పి నను వినక వచ్చుట తగునా ?

సావి : మహాత్మా ! ఈయcదగిన వరంబు నీయక నా కెన్నివరంబు లిచ్చిన నేమిఫలము ! నాపతి నిచ్చెదవేని నే నరుగుదానను.

యము: నీ పతి నీకు లభింపcడని యెన్నిమారులు బోధింపవలయును . నీ వింతకన్న నావెంట రాcజాలవు. అదిగో ! చూడుము! భీభత్సమైన వైతరణీనది యెట్లు దృశ్యమగుచున్నదో !—

ఉ. చీమును నెత్తు రేకమయి చేతము జల్లుమనంగc బాగు చు
ద్దామతిమింగిలాదులకుc దానకమై భయశీలమై యశు
భ్రామితదుర్గమంబయిన వైతరణీనది దాcటcజాల వో
భామిని ! యీ మహానది యపారము నీ యడియాస వీడుమా.

సావి : దేవా ! ప్రేతనాథా ! ప్రీతిని నాథుని వెన్నంటివచ్చు నా కీ వైతరణీనది, గోష్పాద విస్తీర్ణంబై మోకాటిబంటి యగు ; పలుమారులు నన్ను మరలిపొమ్మని ప్రబోధించుచుంటివి. దేవా ! నేను మరలిపోవుటకు నీ వెంత తొందరcజెందు చుంటివో నే నంతకన్న నాతురపడుచుంటిని—కావున నా పతిని నాకిచ్చి నన్నంపుము. నీకుc గడు పుణ్యంబు సమ కూరును.

యము: (తనలో) ఈ సుశీల లక్షణంబులఁ దిలకింప, వైతరణీనదిని సలుపుత మతిక్రమించి వచ్చునట్లున్నది. కావున మఱియొక వరంబిచ్చి లాలించి వెనుకకుఁ బంపెదను. కాకున్న నారదుని మాటయే పాటి గాఁగలదు. (ప్రకాశముగా) శీలవతీ! నీ సౌశీల్యం బెంతయు స్తుతిపాత్రము. నీవు మహాపతివ్రత వగుదువు. నీ పతి జీవంబులుదక్క వేఱొక వరంబుఁ గోరుకొని మరలిపొమ్ము.

సావి: (తనలో) ఇప్పటి కీవరంబును గైకొందుఁగాక! పిదప రక్షింప దాక్షాయణియే కలదు. (ప్రకాశముగా) దేవా! దయాపరుండ వగు నీ దాక్షిణ్యంబు నే నెఱుంగనా! నా పతి జీవంబు లీయక, నా కెన్నివరంబు లిచ్చిననేమి? ఐనను నీ విచ్చెద నన్నప్పు డుపేక్షించు టపచారంబగుఁ గావున నో దేవా!—

గీ. అంబ సావిత్రి కరుణారసంబువలన
కాంత నొక్కతె న న్నొడఁగాంచెనయ్య!
పుత్రకులులేని తండ్రికిఁ బొడమఁ బుత్ర
శతము దయసేయుమయ్య సన్నుతచరిత్ర!

యము: సావిత్రీ! ఈ వరంబుసయితమిచ్చితిని. ఇంక నన్ను వేధింపక పొమ్ము. నే నీ వైతరణీనది నతిక్రమించి యరుగువాఁడ.

[ నిష్క్రమించును ]

సావి: అకటా! శమనుఁడు చనినాఁడుగదా! నే నేమి సేయుదును? ఈ యపార దుస్సహ వైతరణీ ప్రవాహం బొక్కటి నా కవ రోధంబుగ నున్న దే! తల్లీ! సావిత్రీ! నేను నిన్ను నిరంతరం నమ్మి భజించుదాననేని నా కీ వైతరణీనదియందు మార్గమిమ్ము.

[ అనుబంధము 14 ] (5)

[ నిష్క్రమించును ]

అవనిక జారును



# సంగీత సావిత్రి

## షష్ఠాంకము

### 1 వ రంగము

ప్రదేశము — వైశ్యుని గృహము

[ ఇద్దరు భటులు ఒకవైశ్యుడు — ప్రవేశము ]

భటు : నడు—నడు—నీకింక భూమిపై నన్నము లేదు.

వైశ్యు: ఇదుగో ! యములు బాబయ్యలూ — ఇదుగో — ఇప్పుడే రావల్నా కొంచె మాలిశ్యంగా వొస్తేనో ?

భటు : వీలులేదు. నీ కాలము తీరినది. నడు.

వైశ్యు: అంటే ? మన మిప్పు డెక్కడికి వెళుతూ వున్నట్టు ?

భటు : యమధర్మరాజు దగ్గరకు.

వైశ్యు: అబ్బో—అంత దూర మే ?

భటు : దుర్మార్గుఁడా ! కాలయాపనముచేసిన దెబ్బలు తగులును నడు—

వైశ్యు: యములు బాబయ్యలూ—అబ్బో ! మోటసరసాలే— మోటసరసా లే !—అబ్బో—అబ్బో—రాక రాక మా యింటి కొచ్చారుగదా ! కూకోని పోరాదూ ! అబ్బాయీ ! నాగ భోషాణమూ !—యములు బాబయ్య లొచ్చారు సావియ్యా వేమిరా యెఱిసన్నాసి !—సెబరలంక పోగాకు గడమంచె మీాదుంది తెచ్చియ్యి !—మరియా దెప్పుడు నేరుచు కుంటావురా !

భటు : ఛీ !—తొందరగా నడువు.

వై॥శ్యు: అయితే—బాబయ్యలూ—నేనే రావాల్నా! పనేళగదా బేరాలూ సారాలూ సూసుకునీ యేళ!—మా మామ తీరుబడిగా వున్నాడు, అణ్ణి దీసుక పోరాదూ—నేనే రావాల్నా యేమిటీ?—

భటు : తెలివితక్కువమాటలేల? పద! (కొట్టును)

వైశ్యు: అబ్బో! ఇవేమి సరసాలు—యములు బాబయ్యలూ—ఎమికలు విరిగే సరసాలా—ఉండండి—రావలిశుంటే రానే రావాలె—తప్పతుందా యేమిటి?

భటు : అట్లయిన త్వరగా నడు—

వైశ్యు: ఐతే—బాబయ్యలూ—ఎర్రిమొర్రి మాటొక టడుగొచ్చునా?

భటు : ఏదో త్వరగా—యేమువు.

వైశ్యు: నన్నిప్పుడు మీ యముడు బాబయ్యగారు పిలిపించడ మెందుకనీ—

భటు : నీవు పాపములు చేసితివి. శిక్షించుటకు.

వైశ్యు: అబ్బో! నేనేం పాపాలు జేశానూ? పుచ్చుకొనేటప్పు డొకేపు తూచి, ఇచ్చేటప్పు డింకోయేపు తూశానా—పుచ్చుకొనే టప్పు డొకసేరుతో గొలిచి యిచ్చేటప్పు డింకో సేరుతో గొలిశానా—నేతిలో కొవ్వుగలిపానా—ఆవాల్లో సోళ్ళు గలిపానా—బియ్యంలో నూకలు గలిపానా? చెనగల్లో రాళ్ళుగలిపానా? పెసల్లో యిసుక గలిపానా? పాలల్లో నీళ్ళుగలిపానా? నాటకంలో అల్లరి జేశానా? హరికథలో చెప్పు లెత్తుకొని పోయినానా? లంచంబట్టి దొంగ సాక్షా లిచ్చానా? బాకీ యిస్తానని నోటుబుచ్చుకుని నమిలి మింగానా?—గిలుటునగలు బంగారాని వనమ్మేనా!—దొంగలెక్కలురాసి కోర్టులో బడ్డానా?—చచ్చినాళ్ళ బాకీ ఎగేశానా?—దానమిచ్చి లేదన్నానా?—కట్నాలకోసం

పిల్లల్నమ్ముకొన్నానా ? పెట్టెలోంచి రూపాయి లెత్తుకొని పోయి ముండ కిచ్చానా ? గరాణాగావుండి జేబులుగొట్టేనా ? పూటకూళ్ళమ్మ డబ్బెగబెట్టానా ? అన్నం బెట్టినవాళ్ళకు సున్నం బెట్టానా ? తిన్న విస్తళ్ళు గడిగి అందులో మళ్ళీ వొడ్డించానా ? అన్నసత్రాల్లో మన్నుబోశానా ? చలివేంద్ర పందిళ్ళకు రాళ్ళు విసిరానా ? ముండకిచ్చినడబ్బు మళ్ళీ ఎత్తుకొచ్చానా ? గుడిసేటిదాసి కుడుములు దిన్నానా? భాగ్య వంతుల పిల్లలకి ముండల్ని తారిచి డబ్బు గణించానా ? ఆడ బిడ్డలసొమ్మపహరించానా ? అల్లుడి నెత్తిగొట్టి పిల్ల నింట్లో బెట్టుకున్నానా ? అత్తవారింట్లో తేరతిండి మరిగానా ? పెళ్ళాం నగలమ్మి సారాదాగానా ? పుస్తకాలురాయించి డబ్బెగపెట్టానా ? చుట్టాలకు కట్నాలిచ్చి పంపించి వూరి బయట దారిదోచానా ? ధర్మకర్త పనిచేసి దేవుడిసొమ్ము మింగానా ? గుడి గట్టిస్తానని చందాలువేయించి పెళ్ళానికి నగలు జేయించుచున్నానా ? ఇట్లా చేసినవాళ్ళందర్ని దీసుకు పోరేమీ ? నే నేంజేశానసీ ?—

భటు : ఛీ ! ఎలకలసోదిమాని నడిచెదవా ? కొట్టనా ? (కొట్టును)

వైశ్య: (పెద్దపెట్టున బావురుమని యేడ్చుచు) అయితే రావాలిసిం దేనా ! ఇంట్లో అప్పగింతలు బెట్టుకొని రానియ్యరూ ?— తాళంచేతులయినా యిచ్చి రానియ్యరూ ?—యెరుగని సన్నాసులు — ఎక్కడేముందో చెప్పి రానియ్యరూ ?— కాల్దోషంబట్టే పత్రాలయినా చూసుకొని రానియ్యరూ ? రావాలిసిందేనా ? ఎములు బాబయ్యాలూ రావాలిసిందేనా ?

భటు : నీవు దెబ్బలతోగాని లొంగవు—నడు—(కొట్టును)

వైశ్య: (ఏడ్చుచు) కొట్టకండి—బాబయ్యాలోయ్ ! కొట్టకండి— అమ్మాయీ సౌభాగ్యలక్ష్మీ—యమభటులు బాబయ్యాలు నన్ను

గట్టుకొని పోతున్నారేయి—చెల్లీ ! మాణిక్కెమూ—ఇంటేది జాగర్తేయి—పొరుగిళ్ళు దిరగనియ్యకేయీ—డబ్బు పాడు జేసుకోకండిరా ! అబ్బాయీ ! నాగబోషాణమూ—నీ పెళ్ళయినా చేసుకోకపోతివిరా ! రోటికింద రూపాయలు పాతిపెట్టా తీసుకోండిరా ! అరువులు సరువులిచ్చి యెవారం దగలబెట్టకండిరా—పచ్చడికుండలు బయిట బడెయ్యకండిరా—యెంకయ్యగారింకా యేడణాలన్నరియ్యాల అడగండిరా !—అంత పెద్దదీపంబెట్టి సముద్రంతా గాలిస్తే సంసార మొక్క నాటితో పాడయిపోదంటరా ! ఇదుగో—తాళంసేత్తులోయి ! నేను బోతున్నా !—అక్కయ్యా ! నేను బోతున్నానేయి—సంటోడికి గూళ్ళల్లో డబ్బు దొరకనియ్యబోకండి ! సిరితిళ్ళు జేసుకోబోకండిరా !— దొంగ తోడుబోతురోజులు. ఆద మరిసి నిదరబోకండి.

భటు : ఛీ ! పాపీ—నడుము (కొట్టును)

వైశ్య: (ఏడ్చుచు) అయ్యల్లో—అయ్యల్లో—ఎమి కెలిగుతున్నయిరో అయ్యలో—యెములు బాబయ్యలూ—మీకు పటికెబెల్లం బెట్టిస్తాగాని పాతసోటనే కొట్టండి. కొత్తసోట గొట్టబోకండి—ఓ సౌభాగ్గెలక్ష్మి ! ఓరి నాగబోసానం ! నన్ను గట్టుకొని పోతున్నారురా !—నాయనా !

[ భటులు వైశ్యుని లాగుకొని పోవుదురు ]

—: 9 :—

## 2 వ రంగము

ప్రదేశము — యమపుర కవాటము

[ యముడు — ప్రవేశము ]

యము: ఆ సావిత్రి వైతరణీనదిఁగూడ దాఁటినది !—మన్నగరముం ప్రవేశింపకుండఁ గవాటములం బంధించెదగాక ! భటులారా ! భటులారా ! !

[ ఇద్దరు భటులు — ప్రవేశము ]

భటు : దేవా ! ఏమి అనుజ్ఞ —

యము: ఇక్కడికి కొక్క యంగన రయంబున నరుదెంచును. పురంబునం ప్రవేశింపకుండ కవాటకిబులను బంధింపుఁడు.

భటు : భాగ్యము.

[ యముడు లోనికిఁబోవ భటులు కవాటములు బంధింతురు ]

[ సావిత్రి . — ప్రవేశము ]

[ అనుబంధము 14 ] (6)

సావి : ఈ పితృపతి నగరముం ప్రవేశించినాఁడు !—కవాటమా ! బంధింపఁబడియున్నది ! కానిమ్ము. ఇంతదూరము వచ్చిన దాన నిచ్చట భీతిల్లి నిలచిపోవుదునా ? అన్నిటికిఁ గాత్యా యనిదే భారము !—

గీ. వరునిరూపంబుగా కన్య మెఱుఁగనేని
స్వాంతమునఁ బార్వతిని సంస్మరింతునేని
యనమగతి నేఁ బతివ్రత నగుదునేని
యమపుర కవాటభేదనం బగునుగాక !

[ కవాటములు బద్దలగును. భటులు భ్రాంతులగుదురు. సావిత్రి అనుబంధము 14-(7) పాడి నిష్క్రమించును ]

—: ౦ :—

## 3 వ రంగము

ప్రదేశము — యమపురాంతర్భాగము

[ బాధనందు పాపులతో, చిత్రగుప్తాదులతో యముడు — ప్రవేశము ]

యము: చిత్రగుప్తా ! నిన్నటిలెక్కలు సరిగా నున్నవిగదా !

చిత్ర : చిత్తము. సరిగానున్నవి.

యము: సత్యవంతుని యాయుష్కాలము సరిపోయినది నేఁడేకదా ! సరిగాఁ జూడుము.

చిత్ర : దేవా ! ఇందేమియుఁ బొరపాటు లేదు.

[ తెరలో ]

హా ! నాథా ! నన్ననాథనుగావించి, యమ
లోకంబుఁ జేరితివా ! ఎంత మందభాగ్యురాల
నైతిని? యమున కింతైనఁ గనికరము లేకపోయెనా?

యము: (తనలో) ఔరా ! ఎంత యాశ్చర్యము ! ఈ సావిత్రి పురాంత రంబున కెట్లు రాఁగలిగినది ?—విస్మయం బందనేల ? అట్టి దుర్గమ ప్రదేశంబులను నిరాటంకముగ దాఁటివచ్చిన ఈ సతికి కవాటంబు లేపాటివి ? అక్కటా ! ఏమిచేయుదును ! నారదుని పంతమే గెలుచునా ? ఎట్లు గెలుచును ? నే నీమెకు పతి నిచ్చినప్పుడుగదా !—(ప్రకాశముగా) చిత్రగుప్తా ! వేగ ముగ సత్యవంతుని పాపపుణ్య విభాగంబు చేయుము.

[ సావిత్రి — ప్రవేశము ]

సావి : సూర్యనందనా : నీ పాదంబులపైఁ బడిన నన్నుఁ గాపాడ వేమి ? నీ యింటి కతిథినైన నన్ను నిరాకరింతువా ? నాపతిని నా కీయక పాపపుణ్యవిభాగం బొనర్ప చిత్రగుప్తున కాజ్ఞ యిచ్చుట న్యాయమా ? —

చ. పదముల నంటి వేఁడెదఁ గృపాభరితాత్మక ! నా మనోహరున్
సదయుని నాకొసంగి బుధసన్నుత దివ్యయశంబు నందవే !
పదపద యంచు గెంటినను బాయక నీ వెనువెంటనంటి నీ
సదనముఁ జేరవచ్చితిని, సత్కృప నామదికోర్కె నీయవే,

**యము:** రాజపుత్రీ! సావిత్రీ! నీ సాహసం బిప్పు డతీతమైపోయినది! ఇదియేమి వెఱ్ఱి! పాపులు పలుబాములందు నా మందిరంబునకుఁ గూడ వచ్చితివేల? నలునంకలఁ దిలకింపుము. నీతిబాహ్యులై కలుషంబు లాచరించిన తులువ లందుపాట్లు—

సీ. అగ్గికంబంబున కంటఁగట్టఁగ నేడ్చు
    వీఁడె పరాంగనఁ గూడువాఁడు
కాచిన తైలంబు కంఠంబుననుబోయఁ
    బడెడు నీతఁడు సురాపానరతుఁడు
కాయంబునను పలుగాయము ల్సేయు వా
    పోయెడువాఁ డాలఁ గోయువాఁడు
తల గానుగలఁ ద్రిప్పఁ దల్లడిల్లెడువాఁడు
    ముష్కరుండగు బందిపోటుదొంగ
కత్తిచేతను నాలుకను గోయఁబడువాఁడు
    బద్ధసాక్ష్యములిచ్చు పాపరతుఁడు
శూలంబులను గ్రుచ్చ శోకించు దుష్టుండు
    పితరులఁ గడు నేడిపించువాఁడు
శకటంబునకుఁగట్ట చాల నేడ్చెడునట్టి
    పాపాత్ముఁడే మిత్ర వంచకుండు
ఉడుకునూనెనుముంచ మిడుకుచుండెడివాఁడె
    ప్రథిత రాజద్రోహ పాపయుతుఁడు
కొఱతవేయగఁబడి కుమిలియేడ్చెడువాఁడె
    యవనీసురునిఁ జంపినట్టిపాపి

శిరము మంటలనిడ నేడ్చు పరమపాపి
రెండునాల్కలుగలయట్టి మొండివాఁడు
గుదియచే రొమ్ముపై మోదఁ గుందువాఁడు
కన్నబిడ్డలనమ్ము తుష్కరుఁ డతండు.

ఇట్టి పాపాత్ము లనేకులు నిరంతరము భయంకరాకారులగు మత్కుంకరులచేఁ బలుబాధల నందుచుందురు. మఱుగులై దుర్వాసనలు గల్గిన నెత్తుటిమడుగులును, గుళ్ళి క్రిమిసంకు లంబులగు మాంసంబులును, ఘోరోరంగ వృశ్చికాది భీకర క్రిమికీటక సందోహంబులునుగలిగి జుగుప్సా పరిపూరితంబగు నీ ప్రదేశము పుణ్యశీలవగు నీకు నిలువఁదగినదిగాదు పొమ్మా.

సావి : దండధరా ! ధర్మపాలనంబునకుఁ గంకణముఁ గట్టుకొనిన పరేత లోకనాయకునకు—పరమపావన మంగళాంగునకు—నీ యట్టి వానికి నెలవగుభూమి—మత్పతి ప్రాణంబులు తేఁబడిన భూమి—నా పాలిటి పుణ్యక్షేత్రం బగుఁగాని జుగుప్సాభరితం బెటు లగును ? పాశపాణీ ! నీ వెన్ని చెప్పిన నిఁక తెగువ వహించితిని. నేను పతివ్రతను గాన నా పతిని విడువఁజాలను. ఆగ్రహించిన ననుగ్రహించిన నిఁక నీదే భారము.

యము: ఓ సావిత్రీ ! విధినిమార్ప నాకు సామర్థ్య మెక్కడిది ?—

ఉ. బాల ! విధిప్రభావమున పావనమూర్తికి నీదుభర్తకుం
గాలము చెల్లిపోయినది ; కంజహితుండు నిశీథమందు జీ
వాళికిఁ గాంతిగూర్ప నేఱు నంబుజలోచన ! రాఁ డతండు నీ
వేల వృథాప్రయాసముల నీగతిఁ జెందెదవమ్మ ? పొమ్మిఁకన్.

నీ పురాకృతకర్మం బిట్టిదని యెఱుంగుము.

సావి : ఓ సర్వజ్ఞమూర్తీ ! మదార్తి హరింపనోపినవాఁడవని నీ చరణ కమలంబుల నాశ్రయించిన నా కిట్టి హితం బుపదేశించు చుంటివి ! నా పురాకృత కర్మంబని సర్వనిగమ పరిజ్ఞాతవగు నీ వాడఁ జెల్లునా ? మానవప్రయత్నంబునకు దైవం బను కూలించెనేనిఁ పురాకృతంబు గిరాకృతంబు పటాపంచలై పోవవే? ఇద్దానినే ప్రాజ్ఞులు పురుషకారంబనియుఁ దన్మహాత్మ్యం బున ప్రయత్నలోపం బొనరింపలేని మానవులు గతకల్మషులై స్వర్గాద్యుత్తమలోక ప్రాప్తులంగూడఁ గాంతురని పలుకవినవే?

పురాకృతంబును నిందించుచుఁ బురుషకారంబు సలుపకు, నే నట్టివాని నీచుండన నొప్పదే? నా పురుషకారంబునను, భగవానుఁడవగు నీ యనుగ్రహంబునను, నిత్యసత్యశీలుఁడై — విధివిహిత నిగమోక్త కర్మానుష్ఠాన పరతంత్రుఁడై — పితృసేవాభిరతుండగు మన్నాథుండే జీవితుండు గాఁడేని, చతుర్వేదంబు లబద్ధంబులగును. ధర్మంబు మొదలంట నశియించును. పాతివ్రత్య మహాత్మ్యం బనునది నామావశేషం బగును. సూర్యచంద్ర తారకాది గ్రహగణంబులు నిస్తేజంబులై మార్గము ల్దప్పును. చతుర్దశ భువనంబులు నొక్కపెట్టునఁ బ్రళయంబు ఘటియిల్లి వినాశంబు లగును. పరమపతివ్రతనగు నా యభీష్టం బీడేరనప్పుడీ ధర్మంబులతో నాకుఁ బనియేమి? ఈ దైవంబులతో నాకుఁ బనియేమి? నీవు, నీ కింకరులతో నీ లోకంబుతోడ నొక్కమాటే మండి భస్మమై పోయెదరు.

యము: (భయముతో) ఆఁ! ఆఁ! సావిత్రీ! సావిత్రీ! శాంతింపుము. శాంతింపుము. ఎంత సాహసం బొనరించుచుంటివి! నా హస్తం బులం బడినప్రాణికి యెన్నఁడైన మరల శరీరంబు జేరుటఁ గంటివా? కాక వినియైన నుంటివా? ఇది ప్రకృత విచిత్రంబు గాదా? లలితాంగీ! కోపం బుపసంహరించి నీ పతి ప్రాణం బులుదక్క మఱొక్క వరము వేఁడుము—ఇచ్చెదను.

సావి: (తనలో) "నీ పతి ప్రాణంబు దక్క" యను వాక్య మింక నీ యమునకు వదలదయ్యెగా! కానిమ్ము. ఈతఁడు ప్రతియుక్తిచేతఁగాని చక్కఁబడఁడు. (ప్రకాశముగా) దండపాణీ! అట్లే యనుగ్రహింపుము. కోరెదను—

ఆ. నీదుకరుణ మాకు నిఖలరాజ్యప్రాప్తి
గలిగెఁగాని నాదుకాంతు నీవు
బొట్టఁబెట్టుకొంటి వెట్టులో మావవం
శంబునిలువ పుత్రశతక మిమ్ము

యము: ఇచ్చితిని. ఇంకొక వరంబు వేఁడవు గదా ?

సావి : వేఁడను.

యము: అట్లయిన నీ వింక నరుగవచ్చును.

సావి : (నిలువఁబడి యుండును)

యము: సావిత్రీ ! నీ వింకను గదులవేమి ?

సావి : ఎట్లు కదలుదును—నా వరంబు సఫలంబు గావలదా ?

యము: అగునని చెప్పితినిగదా ! ఏలకాదు ?

సావి : అట్లయిన నా భర్త నొసఁగుము.

యము: నీ కిదేమి మూర్ఖ్యము ! మఱొక వర మడుగనని పలికి నే నీయనన్న భర్తృ వరదానమే కోరుచుంటివా ! ఇఁకఁ బొమ్ము. నీ భర్త నీయను ఈయను. తెలిసినదా ?

సావి : (చిఱునవ్వు నవ్వి) యమప్రభూ ! ధర్మపాలకుండవే ! ఎంతలో పొరఁబడుచుంటివి !

యము: నే నేమి పొరఁబడితిని ?

సావి : యోజించుకొనుము.

యము: నీ పతి నీయకుండుటే నా యోజన.

సావి : ఇదియేనా నీ యోజన ? ఇది నీ పెద్దతనమునందలి దోషము గాని—నీది గాదు.

యము: ఏమి ?

సావి : నేను చెప్పుదునా ?

యము: ఏదీ చెప్పుము ?

సావి : ధర్మాత్ముండవగు నీ నోట మాట వెలువడనేకూడదు. వెలు వడిన నంతయు జరుగవలసినదేకదా !

యము: ఔను.

సావి : నేను పతివ్రతనని సమ్మతించితివి! నా సౌశీల్యమున కానందించితివి. అట్టి నాకు నూఱ్ఱురుపుత్రులం బ్రసాదించితివి. పతివ్రతనగు నాకు పతినిచ్చి నీమాట నిలుపుకొనుము.

యము: (మహానందమున) సావిత్రీ! పరమపవిత్రీ! నీ మనోదార్ఢ్యంబునకు బ్రహ్మానందమందితిని. ఇట్టి నీ కేమియొసంగినం దప్పులేదు. నీ పతిని నీ కొసంగితిని. మీ యిరువురకు మంగళంబు లగుఁగాక—

ఉ. ఇచ్చితి నీ మనోహరుని నిచ్చితి పుత్రశతంబు మీకు నే
నిచ్చితి రాజ్యవైభవము నిచ్చితి నింక శతాయువమ్మరో
మెచ్చితి నీదు శీలతను మెచ్చితి నీ పతిభక్తి నాత్మలోఁ
జెచ్చెర భూతలంబునకుఁ జేరఁగఁబొమ్ము సరోజలోచనా!

సావి : మహానుభావా! ఇప్పటికి భాగ్యవతి నైతిని. నా యభీష్టంబీడేరెను. కార్యార్థినై—నీ యాన మీఱి నే నొనరించిన యవిధేయతను మన్నింపుము.

యము: ఇందు మన్నింపవలసిన దేమియును లేదు. అట్టి యవిధేయత వలననే, నీవు భువనపావనివగు సాధ్వీమతల్లివైతివి. నీ పతి చతుశ్శతాబ్దంబు లీభువిం బాలించి యనేకాశ్వమేధంబు లాచరించి సుతశతకంబుఁగాంచి నిన్నుఁగూడి సుఖించును. నీకు విమానంబు నాయత్తపఱచి పంపెదను.

సావి ; మహాప్రసాదము.

అ వ ని క జా ర ను



# సంగీత సావిత్రి

## సప్తమాంకము

### 1 వ రంగము

ప్రదేశము — సత్యవంతుడు పడియున్న వనము

[ సావిత్రి — ప్రవేశము ]

సావి : ఎంతసేపటికిఁ గృతకృత్యురాలనై మరల నానాథుం గననైతిని. (సత్యవంతుని శరీరముం దొడపై నుంచుకొని) జీవితేశ్వరా!

సత్య : (కన్నులు నులిమికొనుచు లేచి) ప్రాణేశ్వరీ! ఎంత నిద్దుర పట్టెను. అబ్బా! దుస్స్వప్నము—

సావి : (సంతోషముతో పాదములంబడి) హా! జీవితేశ్వరా! మరల మీ మంగళాంగము సజీవంబై నా కన్నులఁ బడియెనా! మీ చరిత్రం బవ్వల నెఱింగించెద. తొలుత మీ కరచరణంబు లొకమా రొత్తనిండు. (అట్లు చేయును)

సత్య : దేవీ! ఏమిది? నీ విటులనుచుంటివి! నాకేమైనది! అన్నట్లిప్పుడు ప్రబల శిరోవేదనం బడిపోయితినిగాదా! అదియెట్లు నివారణంబయ్యె! ఔనుసుమా! జ్ఞప్తికిఁ దెచ్చుకొనిచూడ, భీషణశ్యామలాంగుఁడగు నొక్కమహాత్ముఁడు నన్ను యమలోకమునకు గొనిపోయినట్లు దుస్స్వప్నము వచ్చెను.

సావి : నాథా! అదిస్వప్నంగాదు. నిక్కముగ మీరరిగి మరలఁ బ్రదికితిరి.

సత్య : ఏమి యీ చిత్రము! మరణించి నే నెట్లు మగుడ జీవించితిని! ఇదియంతయుఁ బరమాశ్చర్యకరమై యున్నది.

సావి : అత్తమామలు మనకొఱకై వీక్షించుచుందురు. ఆ చరిత్రమెల్ల మార్గమధ్యంబున నెఱిఁగింతును. రండు—పోవుదము.

[ ఇరువురు నిష్క్రమింతురు ]

## ౨ వ రంగము

ప్రదేశము — ద్యుమత్సేనుని యాశ్రమము

[భవానీ, ద్యుమత్సేనుడు, అశ్వపతి, మాళవి, నారదుడు, సావిత్రీ సత్యవంతులు—ప్రవేశము]

నార : మీరంద ఱీసావిత్రి ముఖంబున నీమె సచ్చరిత్రంబెల్ల నాల కించితిరిగదా ! ఇట్టి సుశీల భూతభవిష్య ద్వర్తమానకాలంబులఁ గలుగఁబోదు. ఈమె పుణ్యశ్లోకం బాలకించిన దేవలోకం బంతయు నేఁడు గగ్గోలుగా నున్నది.

ద్యుమ: ఈ సతీతిలకమువలన నా వంశము పావనం బయ్యె ! పోయిన కన్నులును కుమారుఁడును గలిగిరి.

నార : రాజ్యమును సమకూరఁగలదు.

[ వినయశీలుడు — ప్రవేశము ]

విన : ద్యుమత్సేన మహారాజా ! జయము ! జయము ! !

ద్యుమ: ఏమి నాభాగ్యము ! నా పూర్వసచివుండగు వినయశీలుఁడేనా ? మిత్రమా ! రమ్ము. నన్నుఁ గౌఁగిలింపుము !—ఎన్నినాళ్ళకు నీ సందర్శనము !

సత్య : వినయశీలా ! దుష్టచిత్రకేతు హంతకునివలన పా ట్లింకను మీకుఁదీఱలేదా !

విన : మహారాజా ! ఇంకెక్కడి చిత్రకేతుఁడు ? వాని దుష్టపరి పాలనంబున కలుకరెట్టింపఁ బ్రజలందఱుగలసి వానింబొడిచి చంపి కుక్కలకువేసిరి. అప్పుడు రాజ్యం బరాచకముగ నున్నది. వచ్చి పరిపాలించుకొమ్మని ప్రజలు ప్రార్థించుచున్నారు.

ద్యుమ: ఏమి సతీసావిత్రి దివ్యమహిమ ! అమ్మా ! నా కులాలం కారమా !—

సీ. నా పుత్రకునితోడ నయనంబులను రాజ్య
సీమ నిచ్చిన యా సుశీల వీవె

అశ్వ : సుతహీన గతిచేత గతిలేని నాకు స
ద్గతులనిచ్చిన ముద్దుసుతవు నీవె

సత్య : కొమరార యముఁడుగైకొన్న నా ప్రాణపం
చకము నర్పించిన సతివి నీవె

నారద : జమునితో నానాఁడు పల్కిన నా ప్రతి
జ్ఞను నిల్పినట్టి మేల్సాధ్వి వీవె

సావి : ఆ. వితగ నన్ను మీరు స్తుతియింపనేల మీ
కొఱకుగాదు నాదు వరునిగోరి
యిహామునందు బ్రదుక నింత గావించితి
నాత్మలాభమూలమయ్యె యింత.

విన : అయ్యా ! నా సందేశ మేమిచెప్పితిరి ?
సత్య : ఓయీ ! నేఁడే పురంబునకు వచ్చుచున్నాము.
నారద : అశ్వపతి రాజేంద్రా ! ద్యుమత్సేన రాజకంఠీరవా ! మీకు కిం
కేమి గావలయు ?
అశ్వ : అయ్యా ! సావిత్రీ యనుగ్రహంబున మాకు సర్వశుభంబులు
గలిగె ! ఇంక లోకమంగళం బనుగ్రహింపుఁడు —

గీ. పతుల కతివలు నిజమైనభక్తిఁగూర్చి
వివిధసేవలుజేసి సావిత్రిఁబోలి
విదితగురు యశోవాప్తి నందుదురుగాత
లోకమంగళ మగుఁగాక ప్రాకటముగ,

నారద : తథాస్తు.

[ అనుబంధము 15 ]

సంపూర్ణము

# సంగీత సావిత్రి - పాటలు

## —♦ సత్యవంతుడు - అనుబంధము 1 ♦—

కల్యాణి — ఆది

ఈశ్వర సంకల్పము । నెఱుగగా ...ఈ

నెవ్వారితరమగు । నీ రేడు జగముల ।
నేతరి, నేగతి, విధి విధియించెనో ...ఈ

ఒకచో, మోదము । నొకచో ఖేదము । నొకచో
ప్రముదము । నొకచో ప్రళయము । నొనర
జేయునా ప్రపంచాతీతమ । హత్త్వమ
చింత్యము, న ప్రమేయమగు ...ఈ

## —♦ సావిత్రి - చెలి - అనుబంధము 2 ♦—

శ్రీరాగము — ఆది

ఈ వనమూ । మనోహరమూ । సుఖావహామూ । సరోవరమూ ...ఈ

పరమా । ద్భుత । తరువరకలితము । సకల । కుసుమ ।
విసర । భాసురంబగు । నుపవన మహితము ...ఈ

## —♦ సత్యవంతుడు - అనుబంధము 3 ♦—

సారంగ — త్రిశ్రగతి

ఈ మిటారి, యందమూ । నిరుపమానందమూ ...ఈ

కాముని చేముల్కి—యో । కమలభవుని కలికియో ...ఈ

నామది కనుకూలమగున । నన్యరూప విభవమూ ।
సతియో । రతియో । త్రిజగా । తీత సౌందర్యమూ ...ఈ

## సత్యవంతుడు – అనుబంధము 4

హిందూస్తానీ తోడి — త్రిశ్రగతి

ఆహా జగన్మోహినీ | మరపించిపోయె ...ఆహా
దేహ మవశమయ్యె కనుల | దీప్తి నంధకారమయ్యె ...ఆహా
పోవునపుడా|పాలతికి జెడసొంపు|భావజుకటారియయ్యెగా ...ఆహా
ఈ మోహనాకార | మింద్రజాలమయ్యెనాకు ...ఆహా

## సావిత్రి – చెలి – అనుబంధము 5

భీంప్లాస్ — రూపకం

చెలి : కల్యాణీ | నీ యానక విడుమా | బాలామణిరో
నా యానన్ గొనుమా | అలయక పూర్వంబునం |
దలంచిన భూ | పాలున్ మఱువుమా ...కల్యా
సావి : జలజనయన మానసమున | దలచినపతి విడనగునా |
తలపగ నా | తరమగునా | విమలగుణా |
తలతునా | జనకుడు తలచిన పురుషుని ...కల్యా

## సావిత్రి – అనుబంధము 6

జంఝూటి — రూపకం

జనకా యిదితగునా | మనకులమున మారుమనుము ...జన
మనమున నొక వరునిగోరి | మరల నింకొకని దలపగ ...జన

విమల నిగమవిధు లెఱిగిన | తమరే యిటు బలుకా వి |
శ్వమున ప్రాకృతుల | కధర్మవిధి సలుపగ నులుకా యే |
భూమీశుల తనయలిటుల | సలిపిరి | తెలుపుము నాప్రియ ...జన
నా ప్రాప్తమిటులు గానీ | ప్రాప్తింపగ నీ మరణము
నా ప్రాణేశునకు | తనువు నర్పించెదగాని | ఎవరు
వినిన బధిహాసింపరే | నగుబాటగు విషయము ...జన

## —♦ సత్యవంతుడు - అనుబంధము 7 ♦—

పీలు — త్రిశ్రగతి

ఆనసకోదండుడు మల | యా నిలజృంభిత శరీరముల |
కోయటంచు | మదినినొవ్వ | నేసెగా ...ఆన

మానసంబు | వజ్రనిభా | సూనంబయి | నను
మహోగ్ర | నారాచశతంబు విసరివేసెగా ...ఆన

ఏయెడనిలచిన నాపర్వేందువదనయే కనబడ |
మాయంబగు నాశ్లేష మొనర్పదలచినంతలోన ...ఆన

## —♦ సావిత్రి - అనుబంధము 8 ♦—

భాగేశ్వరి — కురుజంపె

ఈగతిని వగవదగునా నీకు జనకా | భూతలముననను
నెందు పుత్రిక లాకరిసాత్తనుట వింతయే ...ఈ

కడుపారగాంచి పెద్దగజేసి వేరొకరి |
కరముజేర్చుటే ఫలం | బిక తల్లిదండ్రులకు |
ఏల నీవీలీల | నిటువిచారింపగను |
నీకు మాయమ్మ యేవిధి లభించె వచింపు ...ఈ

## —♦ సావిత్రి - అనుబంధము 9 ♦—

శ్రీరాగం — త్రిశ్రగతి

జనకా చనుము పురమ్మునకు ప్రియమ్మోన ...జన

మనముననాపై ప్రేమమును మఱువకుము సతమూ|
విఫలంబుగ సంతాపము నెపుడును గనకా | నీసుతకు
నెందు | గొఱతలే | దని హృదయంబున దలంపకా ...జన

చేఁజేతల విడచితిమని | చింతలనిక బాగులకుమా |
వినుమా చనుమా | యిక మానవనాథా | వేగమే ...జన

## సావిత్రి - అనుబంధము 10

జయ్ సావిత్రి పరమ పవిత్రీ |
పావన శుభగాత్రి | భవ్యచరిత్రి ... జయ్

విమలచరణ|దురితహరణ|దీనభరణశీలా|సుమహిత కరుణాల
వాల|సుగుణ నిచయపాలా|పాహిమాం పాహిమాం పాహి ... జయ్

## సావిత్రి - సత్యవంతుడు - అనుబంధము 11

హిందూస్థానీ తోడి — ఆది

సత్య : కాంతా|ఈమహారణ్యా|మెంతో పరితోషకరం|
ఎంతని వర్ణింతు భువనమోహినీ ... కా

చందన పరిమళమిళిత మమందానందకరంబగు |
మందానిల సౌఖ్య మనుభవింపుమా ... కా

సావి : నాథా | ఈ దెస పెనుపేకు|మాకు | లెంతయు దీర్ఘము
లయి గగ | నేందిరి గనుచందమిం దలంపుమా ... నా

సత్య : ఆదెస సెలయేటిబాకు లల్లన ప్రవహించెడు
సమోద్మాదంబు నొసంగుచుం దలంపుమా ... కా

## సావిత్రి - అనుబంధము 12

వ్యాగ్ — ఆది

ప్రాణనాథ మన యాశ్రమమునకున్ |
రయమునన్ | జనుటికన్ తగున్ ... ప్రాణ

భాను డపర శైల | లమునను డాసెగా |
మనగురు లెద నడలుచునుందురుగా ... ప్రాణ

ఈ వనమున మన | మేరిన సమిధలు |
ఫల తరు సుమ నిచయములు తగినయటు |
చేకూరె జాలమి కేల సలుపగా |
చీకుల నరయగ జనగవలయుగా ... ప్రాణ

—♦ యముడు - అనుబంధము 13 ♦—

సురట — రూపకము

పరమాద్భుతంబు గలిగె సుగుణవతిని గాంచగా ।
ఈ నెలతను గాంచిన దోషములు వాయుగా ...పర
పతియె పరమ దైవంబని మతిదలంచు సాధ్వియౌ ।
నుతగుణవతి సతినిజూడ నతచరితుడ నైతిగా !
క్షితిని నెందు నీమెబోలు । సాధ్విని గనుగొనగజాల।
సతియు రతియు । సరిసమాన । మనగ దగుదురే ...పర

—♦ సావిత్రి - అనుబంధము 14—(1) ♦—

[ రా గ మా లి క ]

పోవుచున్నాడే । నా ప్రాణనాథుని ప్రాణము ల్గొని ...పో
ధీవరునీ । నావిభునీ । తీవ్రముగ బంధించి యముడూ ...పో
ఈశ్వరా యింకేదిదారి । శాశ్వతా ప్రమేయశౌరి ।
నశ్వర ప్రపంచమున నే । నెట మెలగుదు దశముఖారి ...పో

—♦ సావిత్రి - అనుబంధము 14—(2) ♦—

కన్నడ — రూపకం

కన్నడ సేయనేలా । కలుషహరణ యో శమనా ।
ఎన్నిగతుల నిను వేడిన । మన్నన జూడవదేల ...పో

—♦ సావిత్రి - అనుబంధము 14—(3) ♦—

కామవర్ధని — రూపకం

హైమవతీ । ధీరమతీ । శ్రీమహితా । గుణభరితా ।
కామరిపు మనోవిహారి । కామవర్ధనీ ...పో

—♦ సావిత్రి - అనుబంధము 14—(4) ♦—

తోడి — త్రిశ్రగతి

ఓ సురవరులారా । ఓహో విబుధేశ్వరులారా ।
భాసమానులారా । నిశ్శేషసుకృతులారా ।
నామనోహరు తోడుకొని రండో మహానుభావులార ...పో

♦ ఇది గ్రామఫోనుప్లేటులో చింతామణి సమాజ నటకులగు బ్రహ్మశ్రీ బ్రహ్మజోస్యుల సుబ్బారావుగారిచే పాడబడినది.

—♦ సావిత్రి - అనుబంధము 14—(5) ♦—

హిందోల్ — రూపకం

దురిత మెఱుగని నావిభుని | నరకమునకు గొనిచనగా |
హృదయమునమరహిందోలా | ఇతుండుగాక నీయముండు ...హో

—♦ సావిత్రి - అనుబంధము 14—(6) ♦—

భూపాల — రూపకం

ప్రణుతి సేయుచున్నదాన | ప్రతిమాలుచు నున్నదాన |
మానసమున గృహవలంపు | మా నావిభుని నాకిమ్ము |
విబుధవినుతశీలా | విశ్రుతగుణజాలా |
ఆలకింపు మీ గోలా | అంతకభూపాలా ...హో

* —♦ సావిత్రి - అనుబంధము 14—(7) ♦—

శ్రీరాగము — రూపకం

శ్రేయమయ్యె నిప్పటికిని | పాయక నా హృదయేశుని |
బాయవలయు నిపుడు ధృతిని | నేయుపాయములనైనను |
చేయగవలె సేవల | నాయతమతినను శ్రీలిడి |
మాయనుర్గాగమునకు | మంగళహారతుల నొసగి |
పోవుచున్నదీ సావిత్రి ప్రాణనాధుని ప్రాణములనిడి ...హో

—♦ మంగళము - అనుబంధము 15 ♦—

బ్యాగ్ — త్రిశ్రగతి

మంధరధర | మంగళకర | మంగళంబురా |
మారసుందరా | శ్రీరమేశ బ్రోవరా | దాసభరణ
దోషహరణ | దానవేశనాశా | శ్రీనివాస జగ
దీశ్వరా | రాజరా | జేశ్వరా | యోపరాత్పరా ...మం

**సంపూర్ణము**

---

* 99 వ పేజీలో "మహాప్రసాదము" తరువాత పాడవలెను. 93 వ పేజీలో 14—(7) బదులు 14—(6) పాడవలెను.